Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు · స్థాపితం: 1930 · జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్ రైతు

సంపుటి: 81 • సంచిక: 20 • 14-5-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



## రాయపాటి వెనుక రోశయ్య?

రాష్ట్ర మంత్రివర్గంలో మధుకోడాలు మించిన అవినీతి మంత్రులున్నారని గుంటూరు ఎమ్పీ రాయపాటి సాంబశివరావు చేసిన సంచలనాత్మక ప్రకటన మంత్రులలో గుబులు రేపుతున్నది. సమయం, సందర్భం లేకుండా రాయపాటి అంత తీవ్ర ప్రకటన ఎందుకు చేశాడన్నది ప్రశ్న. ఇప్పటి మంత్రివర్గం అంటే, అంతా వైఎస్ పెట్టిన మంత్రులే. వారి అవినీతి పోకడల మీద అధిష్టానం అసహనంతో వుందని, వారి అక్రమాల వల్ల రాష్ట్రంలో పార్టీ భ్రష్టుపట్టి పోతున్నదన్న అసంతృప్తితో వున్నదని, ఢిల్లీ పెద్దల మనోభావాలు దగ్గర నుంచి తెలుసుకొనే రాయపాటి , వారి సూచన మేరకు ఈ ప్రకటన చేశాడని ఒక అభిప్రాయం. మరొకప్రక్క ముఖ్యమంత్రి రోశయ్య కూడా ఒక వ్యూహం ప్రకారం ఈ ప్రకటన చేయించాడన్న ప్రచారం వుంది. ఇటీవల జరిగిన క్యాబినెట్ సమావేశంలో శత్రుచర్ల విజయరామరాజు నేతృత్వంలో జగన్ అనుచర మంత్రులు తిరుగుబాటు ధోరణి ప్రదర్శించడం, రాజీనామా చేస్తామని బెదరించడం రోశయ్యకు బాధ కల్గించింది. అటువంటి పొగరుబోతు మంత్రులను తీసి పారెయ్యాలన్నది ఆయన అభిలాష. అందుకు అధిష్టానం అనుమతి కావాలి. గత రెండు నెలలుగా అది దొరకడం లేదు. రేపు రాజ్యసభ ఎన్నికలు కాగానే అధిష్టానం నుంచి అనుమతి సంపాదించి, జగన్ అనుచర మంత్రులను పీకి పారేయడానికి రాయపాటి ద్వారా నాందీ ప్రస్తావన చేశాడని పరిశీలకులు భావిస్తున్నారు. అది నిజం కావాలని మంత్రివర్గ ఆశావహులు కోరుకొంటున్నారు.

## కార్టూన్ స్కేప్



కావాలంటే చూడు ఎంత పెద్ద పీటో!

# అడకత్తెరలో ఇరుక్కొన్న చంద్రబాబు!

రోశయ్య వంటి బలహీన ముఖ్యమంత్రి నేతృత్వంలోని కాంగ్రెస్ పార్టీని మట్టి కరిపించి, చేజారిపోయిన అధికారాన్ని సునాయాసంగా హస్తగతం చేసుకోవాలని కలలు కన్న తెలుగుదేశం అధిపతి చంద్రబాబు నాయుడికి తీవ్రమైన ఆశాభంగం మిగులుతున్నది. వైఎస్ మరణం తర్వాత జరుగుతున్న రాజకీయ పరిణామాలు, తను పన్నిన పథకాలు, అల్లిన వ్యూహాలు అన్నీ బెడిసికొడుతున్నాయి ఆయనకు.

రోశయ్య ఎంతకాలం ముఖ్యమంత్రిగా కొనసాగితే అంతకాలం తనకు క్షేమం అన్నది చంద్రబాబు ఆలోచన. ఈనాడు అధినేత రామోజీరావు కూడా అదే అభిప్రాయంలో వున్నాడు. రోశయ్యకు ప్రమాదం ఏర్పడితే జగన్ వచ్చేస్తాడన్నది భయం. జగన్ ముఖ్యమంత్రి పీఠంపై కూర్చుంటే వైఎస్ కాలం నాటి కంటే తీవ్రమైన పరిస్థితులు, ప్రతికూలతలు తప్పవు. అందువల్ల రోశయ్యను కాపాడడానికి శాసనసభా సమావేశాలలో మ్యాచ్ ఫిక్సింగ్ చేసుకొన్నాడు. అయితే అవి ముగిసిన తర్వాత తానేమి చేయాలో ఆయనకు అర్థం కావడం లేదు. అధిక ధరలు, విద్యుత్ చార్జీల పెంపు, సబ్సిడీ పథకాల కోత, రేషన్‌కార్డుల ఏరివేత, విద్యార్థుల స్కాలర్‌షిప్పుల రద్దు, త్రిపుల్ ఐటి సంస్థల నిర్వీర్యత వంటి అసంఖ్యాక అంశాలు ప్రభుత్వ వైఫల్యాన్ని చాటుతున్నాయి. 1999లో ఇటువంటి నిర్ణయాలకు వ్యతిరేకంగానే వుధృత పోరాటం జరిపి వైఎస్.రాజశేఖర్‌రెడ్డి చంద్రబాబు ప్రభుత్వాన్ని పడగొట్టాడు. కానీ అప్పుడు కాంగ్రెస్‌కు వున్నంతమంది శాసనసభ్యుల బలం తనకు వున్నా, వైఎస్ వలె ప్రజా పోరాటం చేయలేకపోతున్నాడు చంద్రబాబు. ఉద్యమాలు నడిపితే రోశయ్య బలహీనపడి పోతాడని భయం. సాధారణంగా జరిగే కార్యక్రమాలలో కూడా ఎవరిని విమర్శించాలో తెలియక తడబడుతున్నాడు. గతంలో అయితే నేరుగా వైఎస్‌ను తిట్టేవాడు. ఒక్కమాటలో చెప్పాలంటే లక్ష్యం లేకుండా, గురి చూడకుండా బాణం విడవవలసిన దుస్థితి చంద్రబాబుది. ప్రజా వ్యతిరేక నిర్ణయాల మీద కనీస పోరాటం అయినా చేయకుంటే ప్రజలు తమను నిరసిస్తారని తెలుగుదేశం నాయకులు ఆందోళన చెందుతున్నారు.

మరొకప్రక్క తెలంగాణ ఉద్యమం ఆయన మెడకు వుచ్చు వలె బిగుస్తున్నది. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం మీద ఏ నిర్ణయమూ తీసుకోకుండా, తటస్థంగా వుంటే, రెండు ప్రాంతాలలోనూ తెలుగుదేశం లాభ పడుతుందన్నది చంద్రబాబు అంచనా. కానీ అది వికటిస్తున్నదిప్పుడు. ఈ విషయంలో ఎవరూ ఏమీ మాట్లాడరాదని శాసించాడు చంద్రబాబు. శ్రీకృష్ణ కమిటీకి ఎవరి వాదన వారు వినిపించుకోవచ్చునని సలహా ఇచ్చాడు. అయితే నాగం జనార్ధనరెడ్డి తెలంగాణ మీద నానా యాగీ చేస్తున్నాడు. అది కోస్తా జిల్లాల



నేతలకు కష్టంగా వుంది. యనమల రామకృష్ణుడు, సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, పయ్యావుల కేశవ్, ధూళిపాళ నరేంద్ర వంటి నేతలు తమను కట్టడి చేసి, తెలంగాణవాదులను ఫ్రీగా వదలి పెట్టడం పట్ల నిరసన వ్యక్తం చేస్తున్నారు. ఈ పక్షపాత ధోరణి వల్ల తాము తమ ప్రాంతాలలో నష్టపోతున్నామని, కార్యకర్తలకు నచ్చ చెప్పలేక పోతున్నామని వాపోతున్నారువారు.

### బాలకృష్ణకు జ్యోతిష్యం పిచ్చి

ఇదిట్లా వుంటే బాలకృష్ణ కొత్త సమస్యలు తెచ్చి పెడుతున్నాడు. ఆయనకు జ్యోతిష్యం పిచ్చి ఎక్కువ. ఏ పని చేయాలన్నా జ్యోతిష్యులను సంప్రదిస్తాడు. ఎవరో ఒక జ్యోతిష్యుడు ఆయనకు నువ్వు భవిష్యత్తులో ముఖ్యమంత్రి అవుతావని చెప్పాడట. దానితో సింబవ సినిమా సభలలో, టివి ఇంటర్వ్యూలలో తెలుగుదేశం పగ్గాలు తాను త్వరలో చేపడతాననే సూచనలిస్తున్నాడు. ఇది తెలుగుదేశం పార్టీ నేతలకు అర్థం కావడం లేదు. వారికి సమాధానం చెప్పడం చంద్రబాబుకు కష్టంగా వుంది. అట్లని బాలకృష్ణ మనసు నొప్పించే పరిస్థితి లేదు. రేపటి ఎన్నికలలో ఎన్టీఆర్ కుటుంబంతో చాలా అవసరం వుంది ఆయనకు. బాలకృష్ణను ఏ మాత్రం కష్టపెట్టినా, తాను ఎన్టీఆర్ కుటుంబ వ్యతిరేకి అని ముద్ర వేయడానికి, ప్రచారం చేయడానికి దగ్గుపాటి వెంకటేశ్వరరావు, పురంధరేశ్వరి కాచుకొని వున్నారు. ఈ సమస్య చంద్రబాబును బాగా చీకాకు పెడుతున్నది.

### జాతీయ పార్టీ ఆశ

చంద్రబాబు మనసులో తెలంగాణ రావాలన్న కోరిక వుందని కోస్తా జిల్లా నేతల అను

కొరవ 14వ పేజీలో

# ఎవరిది హింస?

నక్సలైట్ల మీద యుద్ధం చేస్తున్నామని పదే పదే ప్రకటిస్తున్నాడు కేంద్రమంత్రి చిదంబరం. ప్రధాని మన్మోహన్‌సింగ్ ఆయనకు వంత పాడుతున్నారు. కుక్కను చంపాలంటే, ముందుగా దానికి పిచ్చి పట్టిందని ప్రచారం చేయాలన్నది పెద్దల ఉవాచ. చిదంబరం ఇప్పుడదే చేస్తున్నాడు. నక్సలైట్లంటే నరహంతకులు, రక్తం త్రాగే రాక్షసులు, హింసోన్మాదులనే అభిప్రాయాలను ప్రజల మెదళ్లలో చొప్పిస్తున్నాడు. నిజమే, చత్తీస్‌ఘడ్ రాష్ట్రం దంతేవాడ జిల్లాలో 76 మంది సిఆర్‌పిఎఫ్ జవాన్లను పూచకోత కోసిన తీరు చూసిన వారికెవరికైనా నక్సలైట్లకు మానవత్వం లేదా అన్న ఆవేదన కల్గుతుంది. కానీ అంత దారుణమైన హింసకు నక్సలైట్లు ఎందుకు పాల్పడుతున్నారో మాత్రం ఏ పత్రికా వ్రాయడం లేదు. ఏ టీవీ ఛానల్‌లో స్పెషల్ రిపోర్టులు ప్రసారం కావడం లేదు.

చత్తీస్‌ఘడ్ ఖనిజ వనరులకు నిలయం. బాక్సైట్, ఐరన్‌ఓర్, మాంగనీసు వంటి విలువైన ఖనిజాలు అపారంగా వున్నాయి. కేంద్ర ప్రభుత్వం అక్కడ స్టెరిలైట్ అనే అల్యూమినియం తయారీ కర్మాగారాన్ని స్థాపించింది. మన్మోహన్‌సింగ్ ప్రధాని కాగానే దానిలోని 51శాతం వాటాను వేదాంత అనే కంపెనీకి అమ్మేశాడు. మైన్ పాత్, కబిర్ధాం అనే రెండు కొండల నుంచి వేదాంత కంపెనీ ఏటా 8లక్షల టన్నుల వరకు బాక్సైట్ ఖనిజాన్ని త్రవ్వి తరలించుక పోతున్నది. దాని ద్వారా వారికి ఏటా కొన్ని వేల కోట్ల రూపాయల లాభం లభిస్తున్నది. కానీ అందులో ఒక్క రూపాయ కూడా స్థానికంగా వుండే గిరిజనులకు కానీ, ఆ ఫ్యాక్టరీలో పని చేసే కార్మికులకు గానీ ఇవ్వడం లేదు. గనుల త్రవ్వకం కోసం వేలాది మంది గిరిజనులను కొండల మీద నుంచి తరలించారు. ఆరేడేళ్లు గడుస్తున్న వారికి కనీస సౌకర్యాలు కల్పించలేదు. ఇప్పటికీ చలికి, ఎండకు బాధపడుతూ తాత్కాలికంగా వేసిన గుడారాలలో నికృష్టమైన జీవితాలు గడుపుతున్నారు వారు. మరొకప్రక్క అన్ని నియమాలను ఉల్లంఘించి ఆ కొండల మీద లోతైన బోర్లు వేసి, వాటిలో మందుకూరి, పేల్చి, బాక్సైట్ త్రవ్వుతున్నారు. ఆ ధాటికి ఐదారు కిలోమీటర్ల దూరంలో ప్రకంపనలకు నేల బీటలు వారుతున్నది. దానితో వ్యవసాయ భూములు సాగు యోగ్యం కాకుండా పోతున్నాయి. అడిగితే వేదాంత కంపెనీ సమాధానం చెప్పదు. ఏ అధికారి కూడా గిరిజనుల జీవన దౌర్భాగ్యాన్ని పట్టించుకోవడం లేదు. మరొకప్రక్క వేదాంత కంపెనీ ప్రభుత్వానికి కట్టవలసిన రాయల్టీ, పన్నులు కొన్ని వందల కోట్ల రూపాయల మేర ఎగనామం పెట్టింది. దానిపై చర్యకు ఉపక్రమిస్తే సుప్రీంకోర్టులో కేసు వేసింది. ఆ కేసులో ఆ కంపెనీకి చిదంబరం న్యాయవాది. తన న్యాయ మేధోసంపత్తి అంతా ఉపయోగించి ఆ కంపెనీకి కోట్ల రూపాయల మిగులు కల్పించాడు.

ఈ నేపథ్యంలో వేదాంత, జిందాల్, ఆర్సెల్ మిట్టల్, రసల్‌ఖైమా, టాటా వంటి కుబేర కంపెనీలు చత్తీస్‌ఘడ్‌లోని తతిమా ఖనిజ వనరులు కొల్లగొట్టడానికి కేంద్ర ప్రభుత్వం నుంచి అనుమతులు తెచ్చుకొన్నాయి. అందుకోసం లక్షల సంఖ్యలో గిరిజనుల జీవితాలను ఛిద్రం చేయడానికి సన్నాహాలు చేస్తున్నాయి. దేశం ఆర్థికంగా అభివృద్ధి చెందాలంటే అడవులలోని ఖనిజ వనరులను ఉపయోగించుకోవడం తప్పనిసరి అనేది చిదంబరం, మన్మోహన్ సింగ్‌ల వాదన. తమ ఇళ్ల క్రింద వున్న ఖనిజాలను త్రవ్వినప్పుడు, అందులో ఒకటి రెండు శాతం వాటా అయినా తమకు ఇవ్వాలని, ఆ లాభాలలో ఎంతో కొంత తమకూ పంచాలని గిరిజనులు కోరుతున్నారు. దానికి ఏ కంపెనీ సిద్ధంగా లేదు. గిరిజన సంఘాలు ఎన్ని వినతులిచ్చినా పట్టించుకోలేదు. వారికి అండగా నక్సలైట్లు నిలబడ్డారు. అందుకే చిదంబరానికి వారి మీద కోపం. సైన్యాన్ని వాడి, ఆకాశం నుంచి బాంబుల వర్షం కురిపించి, నక్సలైట్ అనే వాడి శరీరాలను తునాతునకలు చేసి మరీ ఈ కొండలను మైనింగ్ కంపెనీలకు ఇవ్వాలని చూస్తున్నారు. అందుకోసం వందలాది గిరిజనులను అరెస్టు చేశారు. వారిలో పది పన్నెండేళ్ల బాలలు కూడా వున్నారు.

ఆర్థిక అభివృద్ధి పేరుతో కొన్ని కంపెనీలకు మేలు చేయడానికి వేల మంది గిరిజనులను చంపడానికి సిద్ధపడుతున్న చిదంబరం హింసోన్మాదా, ఆ గిరిజనులకు రక్షణ కల్పించాలని ప్రయత్నిస్తున్న నక్సలైట్లు హింసోన్మాదులా? ప్రజలే తీర్పు చెప్పవలసిన ప్రశ్న ఇది.

జమీన్‌రైతు

## జనవాణి

### పచ్చదనం కనుమరుగు

చరిత్ర పుటలను ఒకసారి పరికిస్తే అశోకుడు రోడ్డుకు ఇరువైపులా చెట్లను నాటించాడన్న వాస్తవసత్యాలు కనపడుతుంటాయి. శాస్త్రవిజ్ఞానం అంటే ఏమిటో తెలియని ఆ కాలంలోనే ముందుచూపుతో అశోకుడు లాంటి చక్రవర్తి ఎన్నో ప్రజోపయోగ పనులు చేశాడు. ప్రగతి రథచక్రాలు పరిగెడుతున్నా ఈరోజుల్లో మాత్రం మనిషి మనుగడకే ఆధారమైన ఆక్సిజన్ అందించే చెట్లను కుంటిసాకులతో కొట్టేస్తున్నారు. విద్యుత్ తీగలకు అడ్డమనో, ఇంటి అంతస్తులు పెంచాలనో చెట్లను తెగ నరికేస్తున్నారు. ఇప్పటికే పర్యావరణ సమతుల్యత దెబ్బతినేస్తున్నది. పచ్చదనాన్ని సైతం కనుమరుగుచేస్తే ప్రజలు నానాపాట్లు పడక తప్పదు. ఖర్చు అనుకోకుండా చెట్లను నాటే కార్యక్రమాన్ని ఉపాధిహామీ పథకంలో ఓ భాగం చేయమని వినతి.

సి.హెచ్.సురేష్‌బాబు, నెల్లూరు

### రోశయ్యను పొగిడి పంపారు!

2వతేది నెల్లూరుకు వచ్చిన ముఖ్యమంత్రి రోశయ్య జనానికి చిల్లిగవ్వంత మేలు చేయలేదు. ఆయన్ను మాత్రం నేదురుమల్లి, ఆనం, రాజీవ్‌భవన్, పనబాక గ్రూపులు వి.ఆర్ కాలేజి సభలో భద్రాద్రి రామయ్యను రామదాసు పొగిడినట్లు మునగచెట్టు ఎక్కించారు. ఈ కార్యక్రమం కోసం ఎన్ని ఫ్లెక్స్ బోర్డులు, ట్రాఫిక్ జామ్‌లు, ప్రజల తరలింపులు అవసరమా? రోశయ్యగారు మాత్రం అన్ని గ్రూపుల నాయకుల ఇళ్లకు వెళ్లి టిఫిన్లు తిని, టీలు త్రాగి వారిచ్చిన కానుకలు స్వీకరించి వెళ్లారు. విచిత్రమేమిటంటే ప్రజలు రాజకీయనాయకుల తీరుతెన్నులు గమనిస్తుంటారు. కాని వారికే ఓట్లు వేస్తుంటారు. విచిత్ర ప్రజాస్వామ్యం. ఇంకేం వ్యాఖ్యానిస్తాం.

వాస్తు రామచంద్ర, నెల్లూరు

### ఏమిటీ ప్రకటనలు?

విద్యార్థులపై ఒత్తిడిని తగ్గించే నెపంతో పదో తరగతి పబ్లిక్ పరీక్షలు రద్దు చేయాలని కేంద్ర మంత్రి పురంధరేశ్వరి అనడం సబబుగా లేదు. ఏ తరగతికి అంత ఒత్తిడి సహజం. విద్యార్థులు నేర్చుకోవాల్సింది ఒత్తిడిని అధిగమించడమే. పడుతూ లేస్తున్న బిడ్డ కష్టపడుతున్నాడని ఎప్పుడూ ఎత్తుకొని వుంటే బిడ్డకు నడక వస్తుందా? సరే పదోక్లాసు వరకు పబ్లిక్ పరీక్ష రద్దు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

17-5-1940
పేజీలు : 16 వెల: అణా

### కాఫీ హోటళ్లు

ట్రంకురోడ్డులో మద్రాసు చైనాబజారు రోడ్డంత జనసమర్థం ఏర్పడ్డది. అందువల్ల టౌనంతా కేంద్రీకరింపబడుతున్నది. వ్యాపారమంతా ఈ ప్రాంతానికి చేరుతున్నది. కాఫీ హోటళ్లన్నీ ఇక్కడే పుడుతున్నవి. గిడుతున్నవి. రామకృష్ణ లంచ్‌హోమ్, కోమల విలాస్, ఆర్యభవన్ ఇవి పాతవి. ఇందులో ఆర్యభవన్ నిద్రపోయింది. రెండో మాటు అక్కడే ఈ దినం ఆర్యభవన్ తృతీయ జన్మ భారత కేఫ్ అనే పేరుతో మొలకెత్తుతున్నది. అనేక జన్మలెత్తిన చంద్రభవన్ తిరుగా ఇక్కడ కూడా పునః ప్రతిష్టితమైంది. దానికి పోటీగా నటరాజ లంచ్ హోమ్ ఒకటి ఏర్పడ్డది. ఇలా దినదిన ప్రవర్థమానమౌతుండే ఇందులో ఒకటి గూడా తెలుగువాడు హోటల్ లేదు. ఆఖరకు తెలుగువాడికి హోటల్ బెట్టుకొనే జాతకం గూడా లేదా?

ఆర్యభవన్ రెండు మార్లు దివాలా దీసిందంటే అరవవాళ్లకు ఏమి నష్టం. అంతా కాపువీధి అమ్మలక్కలకే గదా పాపం!

### నెల్లూరు ముచ్చట్లు

#### సత్యాగ్రహులు

జిల్లా బోర్డు కాంగ్రెసు సభ్యులు 30 మందిలో ఈనాటికి సత్యాగ్రహ ప్లెడ్జిలో చేవ్రాలు చేసినవారు 1.ప్రెసిడెంటు వంగల్లు కోదండరామరెడ్డి, 2.పెరుమాళ్ల నాయుడు, 3.దువ్వూరు బలరామరెడ్డి, 4.మరుపూరు పిచ్చిరెడ్డి, 5.శెట్టిపల్లి కోటయ్య, 6.ఇడమకంటి బ్రహ్మారెడ్డి, 7.చింతలపల్లి లక్ష్మీనరసింహం, 8.రావిపాటి మహానంద ఈ ఎనిమిది మందే కనపడుతున్నారు. ముఖ్యులైన రేబాల దశయ్య, వైస్ ప్రెసిడెంటు గణపం ఇత్యాది వర్గమున్ను ఇంకా వెనుకబడడానికి కారణమౌతున్నది.

ఓ సభ్యుల్లారా! మీరంతా అసలే చేయకుండా వెనకబడ్డారంటే ప్రజలు దుమ్మెత్తి పోస్తారు జాగ్రత్త!.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

13-5-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### కావలి ఉప ఎన్నిక

కాంగ్రెస్ అభ్యర్థి రేబాల దశరథరామిరెడ్డి గారు 12వ తేది శుభఘడియలలో నామినేషన్ దాఖలు చేశారు. వీరుగాక అంతకు ముందు తిమ్మసముద్రానికి చెందిన రామానాయుడు(రాములు)గారు నామినేషన్ వేసి వున్నారు.

### విశ్వనాథం గారి ప్రయత్నం

గత వారంలో తెన్నేటి విశ్వనాథం గారు కోట వెంకటరంగం గారితో కలసి కావలికి వచ్చి మకాంజేసి, కావలి ఓటర్లు వెంకటరంగానికి సుముఖులు కారని గ్రహించి వెళ్లిపోయారు.

తిరిగి విశ్వనాథం గారు 10వ తేదీ రాత్రి విచ్చేశారు. నారీలోకం పత్రిక సంపాదకురాలు, 1955 ఎన్నికలలో గుంటూరు జిల్లాలోని ఒక నియోజకవర్గంలో శాసనసభకు పోటీజేసి ఓడిపోయిన శ్రీమతి రంగమ్మరెడ్డి గారిని ప్రజాపార్టీ అభ్యర్థిగా నిర్ణయించాలని విశ్వనాథం గారి అభిప్రాయంగా తెలిసింది. తనను అభ్యర్థిగా నిర్ణయించమని ఆమె కోరిందని గూడా అన్నారు. ఈమె జన్మస్థానం కావలే. రిటైర్డు సబ్ యిన్‌స్పెక్టరు చిన్నపరెడ్డి గారి కుమార్తె. ఈమె అభ్యర్థిత్వాన్ని స్థానికంగా ఎవరిచేతనైనా ఒప్పించి వదలిపోవాలని విశ్వనాథం గారు ప్రయత్నిస్తున్నారు. కాని ఎవరూ దీనికి సుముఖులు గాదు. అసలు వారితో ఎవరూ పోయి సంప్రతించడం లేదు. వచ్చిన నాటి రాత్రి సమావేశం కావాలనుకొన్నారు; ఎవరూ రాలేదు. తిరిగి మరో రోజు సమావేశపరచాలని ప్రయత్నించారు. సఫలంగాలేదు. తిరుగా ఆనాడు మూడూ గంటలకన్నారు. ఎవరైనా కలసుకున్నారో లేదో తెలియదు. కానీ తెలుస్తున్న దానినిబట్టి, చివరికి రంగమ్మరెడ్డిగారి అభ్యర్థిత్వాన్ని విశ్వనాథం గారు వదలుకున్నట్లే వుంది. వెంకటరంగం గారి ప్రసక్తి అంతకు ముందే పోయింది.

# నెల్లూరు ముచ్చట్లు

## ప్రజాపథంలో ఎన్నికల ప్రచారం

పురపాలక శాఖామంత్రి ఆనం రామనారాయణరెడ్డి 11వ తేది నగరంలోని 43వ డివిజన్ ప్రజాపథం కార్యక్రమంలో పాల్గొన్నారు. అన్న వివేకానందరెడ్డి నుంచి నేర్చుకొన్నాడో ఏమో ఓ దోశెల అంగడి వద్ద కాసేపు కూర్చొని రూపాయ దోశెలు తిన్నాడు. తమ వెనుక తోకలా తిరిగే నగర ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డికి సైతం ఈ దోశెలు తానే స్వయంగా తినిపించి రసవత్తర నాటకానికి తెరఎత్తారు. వివేకానందరెడ్డి నగరాన్ని అన్నివిధాల అభివృద్ధి చేస్తున్నాడు కాబట్టే కార్పొరేషన్ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీకి ఓటు వేయమని ప్రజలను కోరారు. నగరంలో వెయ్యి కోట్ల రూపాయలు వెచ్చించి భూగర్భ డ్రైనేజి, వరద కాలువలు, తాగునీటి పైపులైనుల ఆధునీకరణ, శివారు ప్రాంతాల్లో మౌలిక వసతులు సమకూర్చనున్నట్లు చెప్పుకొచ్చారు. తాను ప్రజారాజ్యం పార్టీ ఎమ్మెల్యే అయినా, తన సరసన నిలబడి మంత్రి కాంగ్రెస్ పార్టీకి ఓటు వేయమని అడిగినా శ్రీధర్‌కృష్ణారెడ్డిలో చలనం లేక పోవడాన్ని ఆ పార్టీ కార్యకర్తలు జీర్ణించుకోలేక పోయారు.

## కెవిపిపై విచారణ చేయించాలి

రాజ్యసభ సభ్యుడు కెవిపి రామచంద్రరావు అవినీతి సామ్రాట్టుగా మారాడని ఆయనపై విచారణ జరిపించాలని జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి డిమాండ్ చేశారు. 11వ తేది నెల్లూరు తెలుగుదేశం పార్టీ ఆఫీసులో విలేకరులతో మాట్లాడుతూ మచిలీపట్నం పోర్టు వద్ద కెవిపి వంద ఎకరాల భూమిని అక్రమంగా పొందారు. గనుల కేటాయింపు, రాజీవ్ రహదారి, అద్దంకి – నార్కేట్‌పల్లి రహదారి పనుల్లో అవినీతికి పాల్పడ్డాడు. ఈ విషయాలను కాంగ్రెస్ పార్టీ నాయకులు జి.వెంకటస్వామి, పాల్వాయి గోవర్ధన్ రెడ్డి, మధుయాష్కీలు బట్టబయలు చేసినా ముఖ్యమంత్రి రోశయ్య పట్టించుకోవడం లేదని విమర్శించారు.

## రంగడి సేవకు మళ్లీ పత్తిబాబు

నెల్లూరు రంగనాయకుల స్వామి దేవస్థానం కొత్త పాలకవర్గం 20వ తేది బాధ్యతలు తీసుకోనుంది. ఈసారి కూడా ప్రత్తి రవీంద్ర బాబునే అధ్యక్షుడిగా ఎంపిక చేశారు. వరిగొండ విజయశంకర్, లక్ష్మీనారాయణ, వెంకటేశ్వర్లు, ఊటుకూరు ముద్దుకృష్ణ, వైవిరెడ్డి, దేవస్థానం అర్చకులు శ్రీనివాసాచార్యులను పాలక వర్గ సభ్యులుగా ఎమ్మెల్యేలు వివేకానంద రెడ్డి, శ్రీధర్‌కృష్ణారెడ్డిలు కలసి ఎంపిక చేశారు. రెండోసారి రంగడి సేవకు భాగ్యం దక్కడం బాబు చేసుకొన్న అదృష్టమే. దీన్ని ఆయన సద్వినియోగం చేసుకోవాలి.

## స్పెషల్ బ్రాంచ్‌కు కొత్త సిఐ

పోలీసుశాఖలో అతి కీలకమైన స్పెషల్ బ్రాంచ్ సిఐగా ఉదయగిరి సిఐగా పనిచేస్తుండిన రామారావును ఎస్పీ దామోదర్ నియమించారు. పాత సిఐ శ్రీనివాసరావు ప్రమోషన్‌పై ఎసిబి డిఎస్పీగా వెళ్లడంతో ఈ నియామకం అవసరమయ్యింది.

## సునామీ భయం

జిల్లావాసులు మరోసారి సునామీ భయంతో వణికిపోయారు. గత సునామీ కరాళనృత్యం జనం మరువక ముందే మే 9వ తేది వెలువడ్డ సునామీ హెచ్చరికలు ప్రజలను భయపెట్టాయి. ఇండోనేషియాలో సంభవించిన భూకంపం కారణంగా సునామీ రానుందని ప్రభుత్వం హెచ్చరించడంతో అధికారులు అప్రమత్తం అయ్యారు. ఆదివారం తడ ప్రజాపథం కార్యక్రమంలో వున్న కలెక్టర్ రాంగోపాల్ తీరప్రాంత అధికారులను అప్రమత్తం చేశారు. ఎస్పీ దామోదర్ సైతం పోలీసులను సంసిద్ధులను చేశారు. తీరప్రాంత మండలాలైన కావలి, బోగోలు, అల్లూరు, విడవలూరు, తోటపల్లి గూడూరు, ముత్తుకూరు, చిల్లకూరు, కోట, వాకాడు, సూళ్లూరుపేట తదితర 12 మండలాల్లో సముద్రంలో అలల తాకిడి తీవ్రంగా వుండింది. ముందస్తు హెచ్చరికల నేపథ్యంలో అధికారులు అప్రమత్తమయ్యారు. సాయంత్రానికి ఎలాంటి ప్రమాదం లేదని తెలుసుకొని ప్రజలు, అధికారులు ఊపిరి పీల్చుకొన్నారు.

## కొండెక్కిన కూరగాయలు

ఎండల దెబ్బ కూరగాయ రేట్లు విపరీతంగా పెరిగిపోయాయి. కిలో పది రూపాయలకు దొరుకుతుండిన నెల్లూరు వంకాయలు 30 రూపాయలయ్యాయి. బీన్స్ కిలో 40 రూపాయలు, పందిరి చిక్కుళ్లు 40, బీరకాయలు 30, చామగడ్డలు 28, టమోటా 15 రూపాయలుగా అమ్ముతున్నారు. కిలో పది రూపాయలకు వచ్చే కూరగాయలు మార్కెట్‌లో లేకుండా పోయాయి. మునగకాయలు, మామిడికాయలు మాత్రం ఓ మోస్తరు రేటుకు దొరుకుతున్నాయి. జూన్ మొదటివారం వరకు ఇదే పరిస్థితి కొనసాగేటట్లుంది. ఎండలు, ఈ రేట్ల నుంచి జనాన్ని దేవుడే రక్షించాలి.

## రాజీవ్‌భవన్ గూటికి రజని

నెల్లూరు నగరంలో వివాదాస్పద కార్పొరేటర్‌గా పేరొందిన 21వ డివిజన్ కార్పొరేటర్ వేల్పుల రజని ఆనం పంచను వీడి రాజీవ్‌భవన్ బాట పట్టింది. తెలుగుదేశం పార్టీ నుంచి కార్పొరేటర్‌గా గెలిచిన ఆమె ఆత్మహత్యాయత్నం చేసి దానికి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి కారకుడని చెప్పడం అప్పట్లో సంచలనం రేపింది. తర్వాత వివేకానందరెడ్డి వద్ద ఆశ్రయం పొందిన ఆమె తనను నిర్లక్ష్యం చేస్తున్నారంటూ రాజీవ్‌భవన్‌కు చేరుకొంది. జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, అనిల్, కోటంరెడ్డి శ్రీధర్ రెడ్డిలు ఆమెను సాదరంగా ఆహ్వానించారు.



ఉత్తమ ప్లేస్‌మెంట్ ఆఫీసర్‌గా ముఖ్యమంత్రి రోశయ్య చేతులమీదుగా అవార్డు అందుకొంటున్న నెల్లూరు వంశీ పెన్ కార్నర్ అధినేత బివి.నరసింహం కుమారుడు, కావలి విట్స్ ఇంజనీరింగ్ కాలేజి ప్లేస్‌మెంట్ ఆఫీసర్ వంశీమోహన్.

## సివిల్స్‌లో కావలి వాసికి ర్యాంకు

సివిల్ సర్వీసు పరీక్షల్లో కావలికి చెందిన ఆలూరి వెంకట్రావ్ 703 ర్యాంకు సాధించాడు. ఇతను నెల్లూరు డికెడబ్ల్యు కళాశాలలో లెక్చరర్‌గా పనిచేస్తూ పట్టుదలతో ఈ ర్యాంకు సాధించాడు.

## రోడ్డు ప్రమాదంలో 13 మంది మృతి

చిత్తూరు జిల్లా చంద్రగిరి వద్ద జరిగిన రోడ్డు ప్రమాదంలో నెల్లూరు నగరానికి చెందిన 13 మంది మృత్యువాత పడ్డారు. శివాజినగర్‌కు చెందిన మస్తాన్ కార్పొరేషన్ ఆఫీసులో అటెండర్‌గా పనిచేస్తుండేవాడు. ఆయన కుటుంబంతోపాటు మిత్రులందరూ కలసి తమిళనాడులోని స్వర్ణ దేవాలయాన్ని సందర్శించేందుకు ట్రాలీ ఆటోలో వెళ్తుండగా ఈ ప్రమాదం జరిగింది. ప్రమాద స్థలిలో 12 మంది మరణించగా వికాస్ అనే బాలుడు ఆస్పత్రిలో చికిత్స పొందుతూ తుదిశ్వాస విడిచాడు. ఈ మరణాలతో ఆయా కుటుంబాల్లో విషాద ఛాయలు అలుముకొన్నాయి.

## పెద్ద దొంగతనం

ఇటీవల కాలంలో నగరంలో దొంగతనాలు ఎక్కువయ్యాయి. ఒకవైపు పోలీసులు జాగ్రత్తలు చెప్తున్నా వరుస చోరీలు జరుగుతూనే వున్నాయి. రామ్మూర్తి నగర్‌లో నివాసం వుండే మహేశ్వరి పరమేశ్వరి కళ్యాణ మండపం యజమాని శక్తి శేషయ్య ఇంట్లో దొంగలు జొరబడి తొమ్మిది లక్షల రూపాయల నగదు, 23 సవర్ల బంగారం అపహరించుక వెళ్లారు. ఇంట్లో శేషయ్య భార్య ఒక్కటే వుండగా ఈ దొంగతనం జరిగింది. పోలీసులకు ఎలాంటి ఆనవాళ్లు దొరకకుండా వుండేందుకు దొంగలు తెలివిగా వ్యవహరించి ఇంట్లో నీళ్లు క్రుమ్మరించారు.

## ప్యాంటులో పేలిన సెల్

సెల్‌ఫోన్‌లు ఇటీవలకాలంలో పేలిపోతున్నాయి. చిల్లకూరు మండలం లింగ

కొరవ 14వ పేజీలో



చతుర్ధ వర్ధంతి

మంచికి మారుపేరుగా నిలచి
అందరికీ ఆప్యాయతానురాగాలు పంచిపెట్టిన మంచి మనిషి
నేత్రదాత
కీ॥శే॥ చిట్టమూరు దశరథరామిరెడ్డి గారు
Ex.ప్రధాన కార్యదర్శి, జిల్లా V.A.O's అసోసియేషన్
పరమపదించి 19.05.2010 తేది నాటికి నాలుగు సంవత్సరములు నిండుతాయి. ఈ సందర్భంగా ఆ పుణ్యమూర్తిని స్మరించుకొంటూ వారి పవిత్రాత్మకు శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.



కీ॥శే॥ చిట్టమూరు దశరథరామిరెడ్డి గారు
Ex.ప్రధాన కార్యదర్శి, జిల్లా V.A.O's అసోసియేషన్

అశ్రునయనాలతో...
భార్య: చిట్టమూరు సరసమ్మ
కుమారులు: చిట్టమూరు నరసారెడ్డి
చిట్టమూరు శ్రీనివాసులురెడ్డి
మరియు కుటుంబ సభ్యులు
ఫోన్: 0861 - 2329848, సెల్: 98858 70125



బార్‌కాస్ సెంటర్‌లో వన్‌వేతో ప్రజల పాట్లు. ఫోర్త్‌టౌన్ పోలీస్‌స్టేషన్ దగ్గర ట్రాఫిక్‌ను బ్లాక్ చేసిన సందు.

# ట్రాఫిక్‌జామ్‌లో మార్పుచేర్పులు!

నెల్లూరు ట్రాఫిక్ నడత మార్చను ఎస్పీ ఈతముక్కల దామోదర్ చేసిన మార్పులు పెద్ద ఫలితమివ్వడం లేదు. పగలు ఎనిమిది గంటల నుంచి రాత్రి ఎనిమిది గంటల వరకు నగరంలో లారీలు, టిప్పర్లకు ప్రవేశం లేదన్న ఆంక్ష పెద్దగా అమలు కావడం లేదు. పైపెచ్చు పోలీసాఫీసు, కలెక్టర్ బంగ్లా, ఎస్పీ బంగ్లాలు వున్న పొదలకూరురోడ్డులో లారీలు, టిప్పర్లు దర్జాగా తిరిగేస్తున్నాయి. స్టోన్‌హౌస్‌పేటలోనికి సరకు లారీలు ప్రవేశించకుండా తీసుకొన్న నిర్ణయంలో మాత్రం ఆ ప్రాంతంలో కాసింత వెసలుబాటు కనిపిస్తుంది. కానీ పట్టణం నడిబొడ్డులో విధించిన ట్రాఫిక్ ఆంక్షల వల్ల ప్రయోజనం సంగతి ప్రక్కనుంచితే ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. మద్రాస్ బస్టాండ్ సెంటర్ నుంచి ఆచారివీధిలోకి వచ్చే వాహనాలకు విధించిన వన్‌వే వల్ల పెద్ద ప్రయోజనం కనిపించడం లేదు. జడ్పీ జంక్షన్ నుంచి చేపలమార్కెట్‌కు వెళ్లాలంటే స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, బారకాస్‌ల మీదుగా ఓ చుట్టు తిరగాలి. మూలపేటలో నుంచి వచ్చే వాహనాలు గతంలో ఉమామహేశ్వరాలయం, చేపల మార్కెట్ సెంటర్ నుంచి పెద్దబజారులోకి అనుమతించేవారు. ప్రస్తుతం అనితా హాలు, జడ్పీ మీదుగా చుట్టు తిరగమంటున్నారు. సూర్య హోటల్, మురళీకృష్ణ హోటళ్ల ముందు వాహనాలకు పార్కింగ్ తీసేస్తే ఈ మార్గాన్ని వన్‌వే చేయాల్సిన అవసరమే వుండదు. మద్రాస్ బస్టాండ్ నుంచి విఆర్‌సి సెంటర్ మధ్య డిఆర్ ఉత్తమకు తూర్పు వైపున వుండే రోడ్డుతోపాటు, ఫోర్త్‌టౌన్ పోలీస్‌స్టేషన్ వుండే రోడ్డును బ్లాక్ చేయడం వల్ల ట్రాఫిక్ మొత్తం విఆర్‌సి సెంటర్‌లో నిలబడిపోతుంది. పైన పేర్కొన్న అడ్డరోడ్లలోనికి ట్రాఫిక్‌ను అనుమతిస్తే విఆర్‌సి సెంటర్‌పై వత్తిడి తగ్గుతుంది. మాగుంట సుబ్బరామిరెడ్డి విగ్రహం, విఆర్‌సి సెంటర్, హరనాధపురం జంక్షన్లలో ఏర్పాటుచేసిన ట్రాఫిక్ సిగ్నల్స్ వద్ద ఫ్రీ లెఫ్ట్ విధానం అమలు కావడం లేదు. ఆర్టీసి బస్టాండ్ దగ్గర సిగ్నల్స్ గందరగోళాన్ని సామాన్యులు అర్థం చేసుకోలేకపోతున్నారు. కూరగాయల మార్కెట్ వద్ద బుట్టల్లో కూర

### ఇబ్బందిగానే వున్నాయి

గాయలు అమ్మేవారి వల్ల ట్రాఫిక్ ఆగదు. తోపుడు బండ్ల వల్ల ఇబ్బందులుండేవి. కనకమహల్ సెంటర్ వద్ద ట్రాఫిక్ సిగ్నల్ లేకపోవడం వల్ల గందరగోళం నెలకొని వుంది. విఆర్‌సి నుంచి ట్రంకురోడ్డు వరకు ట్రాఫిక్ ఆగిపోవడానికి కారణాలను ఎస్పీ గారు పూర్తిస్థాయిలో అన్వేషించినట్లు లేదు. ట్రాఫిక్‌కు అసలు ఇబ్బంది దారులైన వ్యాపార సంస్థల జోలికి వెళ్తే ఎవరెవరో ముందుకు వస్తారు. ఎస్పీని ఇబ్బందుల పాలు చేస్తారు. నగర ట్రాఫిక్‌లో మార్పులు చేర్పులు చేసే ముందు ఒకటికి పదిసార్లు ఆలోచించి చేస్తే బాగుంటుంది. లేకుంటే అనవసరంగా ప్రజాగ్రహానికి గురవ్వక తప్పదు.

# ఇసుక మాఫియాకు గనుల మంత్రి అండ



పెన్నానది గర్భాన్ని తోడేస్తున్న ప్రొక్లెయినర్లు. (ఫైల్‌ఫోటో)

జిల్లాలోని ఇసుక రీచ్‌లలో దాగిన అవినీతిని జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి బయట పెట్టారు. దీని మూలంగా జడ్పీ ఖజానాలో ఈ యేడాది అదనంగా 26 కోట్ల రూపాయలు జమయ్యాయి. ఇసుక మాఫియాపై చర్యలు తీసుకోమని భూగర్భ జల శాఖాధికారులను జడ్పీ ఛైర్మన్ పదే పదే కోరుతున్నా ఆ అధికారుల వైఖరి దున్నపోతుపై వాన పడినట్లుంది. దీంతో ఆయన హైకోర్టులో ఈ విషయమై ప్రజాప్రయోజన వాజ్యం దాఖలు చేస్తే దానికి కౌంటర్‌గా గనులు మరియు భూగర్భ జల శాఖ అధికారులు చేసిన వాదనలు వింటే ఆశ్చర్యపోక తప్పదు. జడ్పీ ఛైర్మన్‌కు ఇంకా ఆరు నెలల పదవీకాలమే వుందని, ఆయన రాజకీయ కక్షతో రీచ్‌లను పాడుకొన్నవారి దుంప తెంచుతున్నారని పనికి మాలిన వాదనలు చేశారు. దీనికి హైకోర్టు జడ్జిగారు కూడా తీవ్రంగా స్పందించారు. జొన్నవాడ, పోతిరెడ్డిపాళెం ఇసుకరీచ్‌ల గడువు ముగిసినా పాట నిర్వహించకపోవడం, అదేవిధంగా ఊటుకూరు, పెన్న బద్దెవోలు, అన్నారెడ్డిపాళెం రీచ్‌ల తాలుకు వేలంపాటల ఫైళ్లు రాష్ట్ర గనుల మంత్రి బాలినేని శ్రీనివాసులురెడ్డి ఆఫీసులో నలగడం వెనుక ఆయనకు పెద్ద మొత్తంలో ఇసుక మాఫియా చెల్లిస్తున్న మామూళ్లే కారణమంటున్నారు. దీనివల్లే జిల్లాలో ఇసుక రీచ్ వేలంపాటలు వెనుకకు పోతున్నట్లు విమర్శలున్నాయి. మంత్రే అక్రమార్కులకు అండగా నిలవడం కన్నా ఘోరమింకొకటి లేదు. వాల్టా చట్టం 2002 ప్రకారం ఇసుక లీజుదారుడు రీచ్‌లలో యంత్రాలను వాడకూడదు. ఒక మీటరు లోతుకు మించి ఇసుక తోడకూడదు. రాష్ట్ర సరిహద్దులు దాటి రవాణా చేయకూడదు. వే బిల్లులు లేకుండా ఇసుకను రవాణా చేస్తుంటే పది టన్నుల కెపాసిటీ గల ట్రక్కుకు పదివేలరూపాయలు, ట్రాక్టరుకు ఐదువేలు జరిమానా విధించాలి. ఇవన్నీ నియమనిబంధనలే తప్ప వీటిని అమలు చేసే గనులు భూగర్భ శాఖాధికారులు లేరు. జిల్లాలోని 48 గ్రామాలలో వున్న ఇసుకరీచ్‌లలో ఇసుక బంగారమయ్యింది. గనుల మంత్రి, ఆ శాఖాధికారులు, కాంట్రాక్టర్లను కోటీశ్వరులను చేస్తుంది. ప్రభుత్వ ఖజానా మాత్రం ఒట్టి పోతుంది.

# ఆగని దొంగ కొళాయిలు!

## ఎన్టీఆర్ నగర్‌లో ఫిట్టర్ చేతివాటం

నెల్లూరు కార్పొరేషన్ కార్యాలయంలో ఎక్కడేమి జరుగుతుందో ఎవరికి తెలియని పరిస్థితులు నెలకొని వున్నాయి. పాలకులు తమకు నాలుగు రూకలు వచ్చే పనులు చేసుకోవడంలో బిజీగా వుంటే, వివిధ విభాగాల్లో పనిచేస్తున్న సిబ్బంది అదే బాటలో నడుస్తున్నారు. వాటర్ వర్క్స్ విభాగంలోని సిబ్బందికి అక్రమ కొళాయి కనెక్షన్లు సిరులు కురిపిస్తున్నాయి. ఆరు మాసాల క్రితం మాగుంట లే అవుట్ ప్రాంతంలోని ఫిట్టర్లు వందల సంఖ్యలో అక్రమ కొళాయిల కనెక్షన్లు ఇచ్చి లక్షలాది రూపాయలు సంపాదించారు. పక్షం రోజుల క్రితం ఎన్టీఆర్ నగర ప్రాంతంలో పనిచేసే ఫిట్టర్లు లక్షలాది రూపాయలు సంపాదించారు. 500లకు పైగా అక్రమ కనెక్షన్లు ఇదే రీతిన ఇచ్చారు. కనెక్షన్‌కు మూడువేల నుంచి ఏడువేల వరకు వసూలు చేశారంటే వీరి ధైర్యాన్ని ఏమనాలో అర్థం కావడం లేదు. మాగుంట లే అవుట్, ఎన్టీఆర్ నగర్‌లలో మునిసిపల్ వాటర్ వర్క్స్ విభాగంలోని ఫిట్టర్లు ఇచ్చిన వందలాది అక్రమ కనెక్షన్ల గూర్చి కమిషనర్, ఇతర అధికారులకు తెలిసినా తెలియనట్లే వ్యవహరిస్తున్నారన్న విమర్శలు వెల్లువెత్తుతున్నాయి. మునిసిపల్ ఖజానాకు ఇంత బహిరంగంగా చిల్లు పెట్టడం భావ్యమా? కంచే చేను మేస్తే ఎవరికి చెప్పాలి?

# పోలీసు సంఘంపై ఎస్పీ కొరడా



ఎస్పీకి కంటిలో నలుసైన పోలీసు అధికారుల సంఘం.

పోలీస్ అధికారుల సంఘానికి ఎస్పీ దామోదర్ షాకిచ్చారు. నాయకుల పేరుతో విధులకు హాజరుకాకుండా వుంటున్న వారికి ఆయన చార్జిమెమో ఇవ్వడం గందరగోళానికి దారి తీసింది. గతంలో సంఘం నాయకులుగా వుండిన శ్రీహరి, గంగాధర్, మోహన్‌రావు, ప్రస్తుత అధ్యక్షుడు మాధవరెడ్డిలకు ఆయన మెమో జారీ చేయడం సంచలనం రేపింది. ఈ పదవిలో వున్న కాలంలో విధులకు హాజరుకానందున జీతాన్ని ఎందుకు రికవరీ చేయరాదో తెలపాలని ఎస్పీ మెమోలో పేర్కొనడంతో ఎస్పీకి, పోలీసు అధికారుల సంఘానికి మధ్య విభేదాలు చెలరేగాయి. దీనికి ఎస్పీ అమలుచేస్తున్న వ్యవహారాల్లో సంఘనాయకుల జోక్యం అధికమవడమే కారణంగా చెబుతున్నారు. ఇటీవల ఎస్పీ దామోదర్ మూడేళ్ల కాలం పూర్తి చేసుకొన్న కానిస్టేబుళ్లను బదిలీ చేస్తున్నట్లు ప్రకటించారు. ఈ విషయంపై పోలీస్ అధికారుల సంఘం నేతలు, రాష్ట్ర నేతలతో కలిసి ఉన్నతాధికారుల దృష్టికి తీసుకొని పోయినట్లు సమాచారం. దీంతో ఎస్పీకి, నేతలకు మధ్య విభేదాలకు బీజం పడింది. గతంలోనూ ఎస్పీగా పనిచేసిన లక్ష్మీరెడ్డి, సంఘనాయకుల మధ్య విభేదాలు చెలరేగి నేతల అరెస్టు వరకు వెళ్లిన సంగతి తెలిసిందే. ఈ పరిస్థితుల్లో దామోదర్ జారీచేసిన మెమోల ప్రభావం ఏవిధంగా వుండబోతుందోనని వ్యాఖ్యానిస్తున్నారు పలువురు పోలీసులు.

# ఆనం కోడాలు

## బ్రదర్స్‌ను మధుకోడాతో పోల్చిన వెంకటరమణారెడ్డి



విలేకరుల సమావేశంలో ఆనం వెంకటరమణారెడ్డి.

అవినీతిలో మధుకోడాను మించిన కోడాలు ఆనం సోదరులని ప్రజారాజ్యం నేత ఆనం వెంకటరమణారెడ్డి ధ్వజమెత్తారు. రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి, మంత్రి రామనారాయణరెడ్డి వ్యవహారశైలిపై విరుచుకపడ్డారు. వివేకానందరెడ్డి విచిత్ర వేషాలతో ప్రజలను మభ్యపెడుతున్నాడని విమర్శించాడు. బిర్యానీలు తింటూ వేషాలేసినంత మాత్రాన ప్రజలకు సేవచేసినట్లు కాదని ఎద్దేవా చేశారు. కందమూరులో గిరిజన మహిళ కాళ్లు పట్టుకొని న్యాయం చేయమంటే తక్షణం స్పందించాల్సిందిపోయి ఆమెను వ్యంగ్యంగా మాట్లాడడం వివేకా దిగజారుడుతనానికి నిదర్శనం అన్నారు. రోజుకో కారులో తిరగడం, షోకులు చేసుకోవడం కాదని కాళ్లకు చెప్పులు లేకుండా తిరిగే పేదల గురించి పట్టించుకోవాలని సూచించారు.

# ప్రజల సమస్యలకు

# పరిష్కారం చూపని ప్రజాపథం!

జిల్లాలో ఏప్రిల్ 19తేది నుంచి మే 14తేది వరకు 25 రోజులపాటు జరిగిన ప్రజాపథంలో పరిష్కరించిన సమస్యలను వేళ్ల మీద లెక్కపెట్టవచ్చు.

**గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లోని ప్రజాసమస్యలను ఎక్కడికక్కడే పరిష్కరించాలన్న సంకల్పంతో ప్రజాపథం కార్యక్రమానికి రాష్ట్ర ప్రభుత్వం శ్రీకారం చుట్టింది. అయితే ప్రజలు ఎదుర్కొంటున్న వివిధ సమస్యలపై ఎప్పటి నుంచో మండలస్థాయి అధికారుల నుంచి జిల్లాస్థాయి వరకు వినతి పత్రాలు సమర్పిస్తూనే వుంటారు. వీటిని పరిష్కారించేందుకు ఏమాత్రం చొరవ చూపని అధికారులు ప్రజాపథం కార్యక్రమంలో ప్రజల నుంచి ప్రతిఘటనలు, నిరసనలు ఎదుర్కోక తప్పలేదు.**

## నీటి ఎద్దడిపై నిలదీత

అసలే వేసవి కాలం కావడం వలన త్రాగునీటి ఎద్దడి అధికారులకు గుది బండగా మారింది. ప్రజాపథం కార్యక్రమం నిర్వహించేందుకు జిల్లాలోని ఏ గ్రామానికి వెళ్లినా కూడా త్రాగునీటి సమస్యను పరిష్కరించాలని అధికారులను ప్రజలు నిలదీస్తున్నారు. ఎమ్మెల్యేల దగ్గర నుంచి క్రిందిస్థాయి అధికారుల వరకు ఎవరిని వదిలి పెట్టకుండా ప్రశ్నల వర్షం కురిపిస్తున్నారు. గతంలో నిర్వహించిన ప్రజాపథం కార్యక్రమంలో సమర్పించిన వినతిపత్రాలపై కూడా కొన్ని గ్రామాల ప్రజలు ఆరాతీయడంతో సరైన సమాధానం చెప్పలేక అధికారులు నీళ్ల నమలాల్సిన దుస్థితి ఏర్పడింది.



మురికి కాలువల గట్టుపై కూర్చుంటే సమస్యలు పరిష్కారమవుతాయా?

ఏప్రిల్ 19వ తేది నుంచి మే 14వ తేది వరకు 25 రోజులపాటు జిల్లాలో ప్రజాపథం కార్యక్రమం కొనసాగింది. రాష్ట్రప్రభుత్వం ఎంతో ప్రతిష్టాత్మకంగా ఈ కార్యక్రమాన్ని నిర్వహించేందుకు రూపకల్పన చేసిన ప్పటికి ఆచరణ, అమలులోకి వచ్చేసరికి అనేక లోపాలు, ఇబ్బందులు ఎదుర్కోక తప్పలేదు. త్రాగునీటి సమస్య, విద్యుత్ సరఫరా, జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం అమలు, 108, 104 వైద్య సేవల గురించి అవగాహన, సంక్షేమ పథకాల అమలు, వాటి తీరుతెన్నులు తదితర సమస్యలను ప్రధానంగా చేసుకుని ఈ కార్యక్రమాన్ని రూపొందించడం జరిగింది.

ప్రభుత్వం పేర్కొన్న సమస్యలు ఎప్పటి నుంచో గ్రామీణ ప్రాంతాలలో వున్నాయి. ఈ కార్యక్రమం ద్వారా గ్రామాలకు వెళ్లే అధికారులు, అదనపు సమస్యలను పరిష్కరించిందిగాని, క్రొత్త పనులు మంజూరు చేసినవిగాని ఏమి లేవు. మండలస్థాయిలో వుండే అన్ని శాఖల అధికారులు ఈ కార్యక్రమంలో భాగస్వాములు కావాలని ప్రభుత్వం ఆదేశించినా కొన్ని శాఖల అధికారులు ఏదో ఒక సాకు చూపి కార్యక్రమానికి దుమ్మాకొట్టారు. ముఖ్యంగా త్రాగునీటి సరఫరా, ఇందిరమ్మ గృహాల నిర్మాణాలకు సంబంధించిన బిల్లుల చెల్లింపు, రేషన్‌కార్డుల తొలగింపు తదితర సమస్యలపై అధికారులు ప్రజలకు సమాధానం చెప్పలేక ఉక్కిరి బిక్కిరి కావాల్సిన పరిస్థితి ఏర్పడింది.

## ప్రతిపక్ష ఎమ్మెల్యేల పాట్లు

కొన్ని మండలాల్లో ప్రజాప్రతినిధులు, అధికారుల మధ్య వివాదాలు రాజుకున్నాయి. వెంకటగిరి అసెంబ్లీ నియోజకవర్గం పరిధిలోని బాలాయపల్లిలో మండలపరిషత్ అభివృద్ధి అధికారి, ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ అనుచరుల మధ్య సంక్షేమ పథకాల విషయంలో తీవ్ర వాగ్వివాదం చోటుచేసుకోవడం జరిగింది. ఈ వాగ్వివాదం తీవ్ర రూపం దాల్చి చివరకు ఎంపిడిఓ వెంకటసుబ్బయ్య ఎమ్మెల్యేపై స్థానిక పోలీసుస్టేషన్‌లో ఫిర్యాదు చేసేవరకు వెళ్లింది. ఇదే కార్యక్రమంలో ఎంపిడిఓ ఒక దళితుడిని కులం పేరుతో దూషించాడంటూ ఎమ్మెల్యే అనుచరులు మరో అట్రాసిటి కేసు నమోదు చేయాలన్న ఫిర్యాదు కూడా చేయడం జరిగింది.

ప్రతిపక్ష పార్టీలకు చెందిన ఎమ్మెల్యేల పట్ల అధికారులు సైతం అవమానకరంగా ప్రవర్తిస్తున్నారన్నది ఎమ్మెల్యేల అభిప్రాయం. ఈ సంఘటన జిల్లావ్యాప్తంగా చర్చనీయాంశంగా మారి, ఎంపిడిఓ పట్ల దురుసుగా ప్రవర్తించిన ఎమ్మెల్యే బేషరతుగా క్షమాపణ చెప్పకపోతే ఆందోళన కార్యక్రమం చేపడతామని ఎంపిడిఓల సంఘం, నాయకులు ఎమ్మెల్యేకు ఘాటుగా హెచ్చరికలు జారీ చేశారు. దీనిపై స్పందించిన జిల్లా స్థాయి అధికారులు క్రమశిక్షణ చర్యల్లో భాగంగా ఎంపిడిఓ పట్ల దురుసుగా ప్రవర్తించాడన్న కారణంపై స్థానిక రేషన్‌షాపు డీలర్‌ను సస్పెండ్ చేశారు. ఎంపిడిఓను దూషించాడన్న కారణంతో డీలర్‌ను సస్పెండ్ చేసిన అధికారులు దళితుడిని కులం పేరుతో దూషించిన ఎంపిడిఓపై ఎటువంటి చర్యలు తీసుకోకపోవడం విమర్శలకు దారి తీసింది.

## పట్టణ ప్రాంతాల్లోనూ...అదే దారి

నెల్లూరు, కావలి, గూడూరు, వెంకటగిరి మునిసిపాల్టీలలో కూడా ప్రజాపథం కార్యక్రమం కేవలం ప్రచారానికి పరిమితమై పోయింది. నెల్లూరు నగరంలో సిటీ, రూరల్ ఎమ్మెల్యేలు డివిజన్‌లలో జరిపిన పర్యటనలలో ప్రజలకు సంబంధించిన ఎటువంటి సమస్యలను పరిష్కరించకలేకపోయారు. నగరంలో త్రాగునీటి ఎద్దడి తీవ్రంగా వుంది. ఏ డివిజన్‌కు వెళ్లినా కూడా స్థానికులు త్రాగునీటి సరఫరా, పారిశుద్ధ్యం, డ్రైనేజి కాల్వల ఏర్పాటుపై అధికారులు, ఎమ్మెల్యేలను ప్రశ్నిస్తున్నారు. ప్రజాపథం కార్యక్రమానికి ప్రత్యేక నిధులంటూ ఏమి కేటాయించకపోవడంతో పనులు చేపట్టేందుకు నిధులు మంజూరు చేయలేక అధికారులు ఏదో ఒక హామీ ఇచ్చి బయటపడాల్సిన పరిస్థితి ఏర్పడింది.

గూడూరు, సూళ్ళూరుపేట, కావలి, వెంకటగిరి అసెంబ్లీ నియోజకవర్గాలలో తెలుగుదేశం పార్టీకి చెందిన ఎమ్మెల్యేలందరు కూడా ప్రతిరోజు నిర్వహించే ప్రజాపథం కార్యక్రమంలో పాలుపంచుకోలేకపోయారు. అధికారపక్షానికి చెందిన ఎమ్మెల్యేలు సైతం ఇదే బాటలో పయనిస్తున్నారు. దీంతో మండలస్థాయి అధికారులే కార్యక్రమాన్ని ఏర్పాటుచేసి సంక్షేమ పథకాలు గురించి నాలుగు మాటలు చెప్పి ముగించేస్తున్నారు. ప్రజల నుంచి కూడా ఈ కార్యక్రమానికి పెద్దగా స్పందన కన్పించ లేదు.



వివేకా ప్రజాపథం ఇటువంటి జిమ్మిక్కులతో సరి...

ఇదిలావుండగా అన్ని గ్రామాల్లో ప్రజాపథం కార్యక్రమం నిర్వహించాల్సి వుండగా పంచాయితీల వరకే అధికారులు పరిమితం చేశారు. ముందుగా ఏ గ్రామంలో ప్రజాపథం నిర్వహించే విషయం పై దండోరా వేయించి ప్రజలకు సమాచారం అందించాల్సి వుంటుంది. కానీ అధికారులు మాత్రం పంచాయితీ కార్యాలయానికే పరిమితమై మిగిలిన గ్రామాల ప్రజలను అక్కడికే తరలిరావాలని గ్రామ తలారుల ద్వారా కబురు పంపారు. దీంతో కొన్ని గ్రామల ప్రజలు ప్రజాపథం కార్యక్రమానికి వచ్చి తాము ఎదుర్కొంటున్న సమస్యలను అధికారుల దృష్టికి తీసుకురాలేకపోయారు. ఇటీవల జిల్లాపరిషత్ ఛైర్మన్ కూడా పంచాయితీ పరిధిలో వుండే అన్ని గ్రామాలకు కూడా ఈ కార్యక్రమాన్ని నిర్వహించాలని అధికారులకు విజ్ఞప్తి చేసినా పట్టించుకున్న అధికారులు ఒక్కరూ లేరు.

## తూతూ మంత్రంగా సభలు

ఎమ్మెల్యేలు హాజరు కాని చోట స్థానిక సర్పంచ్‌లు, ఎంపిటిసి, జడ్పీటిసిలు పాల్గొని కార్యక్రమాన్ని నడిపించారు. గ్రామీణ ప్రాంత ప్రజలు లేవనెత్తే అంశాలన్ని ఆర్థిక వనరులతో ముడిపడి వుంటున్నాయి. నిధులు కేటాయించే అధికారం మండలస్థాయి అధికారులకు వుండదు. దీంతో వీరి దృష్టికి వచ్చిన సమస్యలను చూస్తాం, పరిశీలిస్తాం అంటూ ఏదోఒకటి చెప్పి గ్రామాల నుంచి బయటపడ్డారు. ప్రజల నుంచి విమర్శలు ఎదురవుతున్న విషయాన్ని ముందుగా గుర్తించిన అధికారులు ఎటువంటి ప్రచారం చేయకుండా ప్రజలు అధికసంఖ్యలో పాల్గొనకుండా జాగ్రత్తలు తీసుకొన్నారు.

జిల్లాలోని 10 అసెంబ్లీ నియోజకవర్గాలు, 46మండలాలు, నాలుగు మునిసిపాల్టీలలో 25రోజులపాటు ప్రజాపథం కొనసాగింది. ఈ కార్యక్రమం పుణ్యమా అంటూ కొందరు అధికారులు ప్రజలకు అందుబాటులో లేకుండా పోయారు. మొత్తం మీద ప్రజాపథం కార్యక్రమం ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలకు ఎటువంటి పరిష్కార మార్గం చూపకుండానే ముగియడం విశేషం.



# బ్లాకులో రీచార్జి కూపన్లు!

## ● ముత్తుకూరు వ్యాపారస్తుల చేతివాటం

ముత్తుకూరు మండలంలో సెల్‌ఫోన్ రీచార్జి కార్డులకు వున్న డిమాండ్‌ను దృష్టిలో వుంచుకొని వ్యాపారులు వీటిని అధిక ధరలకు విక్రయిస్తున్నారు. కృష్ణపట్నం పోర్టు ఏర్పాటు కావడం, పలు పవర్‌ప్రాజెక్టులు ఏర్పాటు కానుండడం, రియల్ ఎస్టేట్ వ్యాపారం ఇతరత్రా వ్యాపకాలతో మండలంలో సెల్‌ఫోన్‌ల వినియోగం పెరిగింది. మండల కేంద్రమైన ముత్తుకూరుతోపాటు గ్రామాల్లోను ఇబ్బడి ముబ్బడిగా సెల్‌ఫోన్ సిమ్ కార్డులు, రీచార్జి కూపన్‌ల అమ్మకాలు పెరిగాయి. సెల్ వినియోగదారుల అవసరాన్ని అవకాశంగా చేసుకొన్న పలువురు వ్యాపారులు వివిధ కంపెనీల రీచార్జి కార్డులను అధిక ధరలకు విక్రయిస్తూ వినియోగదారుల జేబులకు చిల్లు పెడుతున్నారు. వివిధ ప్రాంతాల నుంచి పోర్టు తదితర ప్రాంతాలకు వచ్చే వాహనాల డ్రైవర్లు, ఇతరత్రా ప్రాంతాలవారు ఇదేమిటని ప్రశ్నిస్తే వ్యాపారులు వారితో దురుసుగా ప్రవర్తిస్తూ ఇష్టముంటే కొనండి లేకపోతే పోండి అధిక ధరపెట్టి కొనాల్సిందేనంటూ దబాయిస్తుండడంతో చేసేది లేక అవసరాల కోసం రీచార్జి కూపన్‌లను కొనుగోలు చేయాల్సి వస్తోందని పలువురు వినియోగదారులు వాపోతున్నారు.

# ఆఫీసులులేని పంచాయితీలు

**పారిశ్రామిక మండలంలో ప్రగతిది!**

పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న ముత్తుకూరు మండలంలోని పలు పంచాయితీలకు కార్యాలయాలు లేకపోవడం పేరు గొప్ప ఊరుదిబ్బ అన్న సామెతను గుర్తుకు తెస్తున్నది. ప్రభుత్వం ప్రవేశపెట్టే పథకాలు ప్రజలకు చేరువ కావాలంటే పంచాయితీలే కీలకం. అలాంటి పంచాయితీలకు కార్యాలయాలు లేకపోవడం సిగ్గుపడాల్సిన విషయం. మండలంలోని పోలంరాజుగుంట, పాటూరివారి కండ్రిగ, నేలటూరు, పొట్టెంపాడు, వల్లూరు, తాళ్లపూడిగ్రామ పంచాయితీలకు సొంత భవనాలు లేకపోవడంతో సిబ్బంది పలు అవస్థలు పడుతున్నారు. వల్లూరులో తుఫాన్‌షెల్టర్‌లో నిర్వహించాల్సిన దుస్థితి ఏర్పడింది. మరోవైపు కార్యదర్శులు అందుబాటులో వుండకపోవడంతో పలుగ్రామాల ప్రజలు ప్రదక్షిణలు చేయాల్సి వస్తోంది. ఇప్పటికైనా అధికారులు స్పందించి పారిశ్రామిక ప్రగతి సాధిస్తున్న మండలంలో పంచాయితీలకు తగిన భవన సౌకర్యం కల్పించాలని గ్రామస్తులు కోరుకొంటున్నారు.

● నాసిరకంగా

# రోడ్ల నిర్మాణం!

## వెంకటగిరిలో ఉపాధి నిధులు దుర్వినియోగం

వెంకటగిరి నియోజకవర్గంలో ఉపాధి హామీ పథకం నిధులతో నిర్మిస్తున్న గ్రామీణ రోడ్లలో నాణ్యత లోపిస్తోంది. నియోజకవర్గం మొత్తం మీద 4.5కోట్ల వ్యయంతో రహదారుల నిర్మాణం జరుగుతుంది. తగిన నిష్పత్తిలో కంకర, గ్రావెల్ వేయకపోవడం, క్యూరింగ్ సక్రమంగా చేయనందువల్ల నాసిరకంగా రోడ్ల నిర్మాణం జరుగుతుంది. వీటిని పర్యవేక్షించాల్సిన అధికారులు ఆవైపుగా దృష్టిసారించకపోవడంతో రోడ్ల నిర్మాణంలో అవినీతి రాజ్యమేలుతోంది.

వెంకటగిరి మండలంలో 26లక్షలతో పంజాం, విశ్వనాధపురం, మాతలూరు, బుసపాళెం, ఆర్‌ఎస్ కండ్రిగ, గొట్లగుంట గ్రామాల మధ్య రోడ్డు నిర్మాణాలు జరుగుతున్నాయి. డక్కిలి మండలంలోని 30 గ్రామాల్లో 50లక్షల రూపాయల నిధులతో అంతర్గత రోడ్లు నిర్మితమవుతున్నాయి. అలాగే బాలాయపల్లి మండలంలోనూ 75లక్షలతో పనులు జరుగుతున్నాయి. నియోజకవర్గం మొత్తం మీద అవసరమైన చోట రోడ్లను నిర్మించకుండా అనవసరపు ప్రాంతాల్లో వీటిని నిర్మిస్తున్నారనే విమర్శలు వ్యక్తమవుతున్నాయి.

# దాహార్తి తీర్చను ట్యాంకర్

**- నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ వితరణ**

వెంకటగిరి వాసుల దాహార్తి తీర్చేందుకు మాజీ మంత్రి నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ సొంత నిధులతో నీళ్ల ట్యాంకర్‌ను అందజేశారు. ట్యాంకర్‌ను ప్రారంభించిన ఆమె మాట్లాడుతూ నేను మంత్రిగా వున్నప్పుడు కోట్ల రూపాయల నిధులు తీసుకవచ్చాను, ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు జరిపించాను. అయినా అసెంబ్లీ ఎన్నికల్లో ఇక్కడ కాంగ్రెస్ పార్టీకి నష్టం జరిగిందని ఆవేదన వ్యక్తం చేశారు. ఈ సందర్భంగా సునీల్‌కుమార్‌ను ఇన్‌ఛార్జిగా నియమిస్తారా అని స్థానికులు అడగ్గా దానికి ఆమె స్పందిస్తూ ఆయన రారు, మా కుమారులు రారు అంటూ ఖరాకండీగా చెప్పారు.

# శృతిమించుతున్న మందుబాబులు

**బోగోలులో పరిస్థితిది!**

మండల కేంద్రమైన బోగోలులో మందుబాబుల ఆగడాలు రోజురోజుకు శృతిమించిపోతున్నాయి. విచ్చలవిడిగా మద్యం అమ్మకాలు జరుగుతుండడంతో ప్రజలు రోడ్ల మీద తిరగాలంటేనే భయపడుతున్నారు. ముఖ్యంగా మహిళలు త్రాగుబోతుల అల్లరికి ఇంట్లో నుంచి బయటకు రావాలంటేనే హడలిపోతున్నారు. ఇబ్రహీంపేట, బజార్‌సెంటర్ తదితర ప్రాంతాల్లో వీరి అల్లరి అధికంగా వుంది. సామాన్లు కొనుగోలు చేసేందుకు, ఇతరత్ర పనులపై వచ్చేవారు త్రాగుబోతుల కారణంగా ఇబ్బందులు పడాల్సి వస్తోంది. రోడ్లపై పోయే అమ్మాయిలను తమ వికృత చేష్టలతో అల్లరిపెట్టడం, ద్వందార్థాల మాటలు, వ్యాఖ్యలతో వేధిస్తుండడంతో బాలికలు కన్నీళ్ల పర్యంతం అవుతున్నారు. బహిరంగంగా రోడ్డు మీదే మద్యం తాగుతూ అల్లరికి పాల్పడుతున్నా పోలీసులు పట్టించుకోకపోవడంతో వీరి అల్లరికి అంతే లేకుండా పోతుందని స్థానికులు వాపోతున్నారు.



నెల్లూరు బాలాజీనగర్‌లోని అన్నపూర్ణ అపార్టుమెంటు దగ్గర ప్రజారాజ్యం పార్టీ నాయకుడు షేక్ ఖాజామొహిద్దీన్ ఏర్పాటు చేసిన చలివేంద్రను ప్రారంభిస్తున్న నగర ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి. ప్రక్కన ద్వారక్‌నాధ్, ఖాజావలి తదితరులు.




నెల్లూరు జడ్పీ ఆఫీసు సెంటర్‌లో శ్రీసాయి సబర్మతి శాంతి నికేతన్ సేవా ట్రస్ట్ నేతృత్వంలో మినరల్ వాటర్ చలివేంద్రను పెట్టిన మాజీ ఎన్జీఓ సంఘ నేత నారాయణను అభినందిస్తున్న విశ్రాంత వుద్యోగులు.




నెల్లూరు ఆర్టీఓ కార్యాలయం వద్ద డ్రైవింగ్ ట్రాక్‌ను ప్రారంభించిన అనంతరం జరిగిన సభలో మాట్లాడుతున్న రవాణాశాఖ కమిషనర్ రేమాండ్ పీటర్. వేదికపై రవాణాశాఖ డిప్యూటీ కమిషనర్ వై.జయకుమార్‌రెడ్డి, జిల్లా కలెక్టర్ రాంగోపాల్ తదితరులు.



అంతర్జాతీయ మాతృదినోత్సవం సందర్భంగా నెల్లూరు టౌన్‌హాల్‌లో తిక్కన రచయితల సంఘం నేతృత్వంలో జరిగిన కవి సమ్మేళనంలో పాల్గొన్న కవులకు పుస్తకాలు ప్రదానం చేస్తున్న ఫిల్మ్ సెన్సార్ బోర్డు సభ్యుడు ఆంజనేయులు.



హైదరాబాద్‌లోని డాక్టర్ బి.ఆర్.అంబేద్కర్ ఓపెన్ యూనివర్సిటీ నుంచి రాజనీతి శాస్త్రంలో పోస్టుగ్రాడ్యుయేషన్ డిగ్రీ చేసి అత్యధిక మార్కులు పొందిన నెల్లూరు ఎస్ఎయుపి పాఠశాల ఉపాధ్యాయిని మెర్సిని గవర్నర్ నరసింహన్ బంగారు పతకంతో సన్మానించారు.

# స్మగ్లర్లు దొరకరా?

● వెంకటగిరిలో అటవీశాఖాధికారుల దొంగాట

వెంకటగిరి ప్రాంతంలో ఎర్రచందనం స్మగ్లింగ్ యదేచ్ఛగా జరుగుతూ వుంది. అటవీశాఖ అధికారులు కఠిన చర్యలు చేపడుతున్నామని, అక్రమ రవాణాపై దృష్టి సారించామని పదేపదే ప్రకటిస్తున్నా అది కేవలం ప్రకటనలకే పరిమితమవుతోంది తప్ప ఆచరణలో అమలు కాక పోవడంతో ఎర్రచందనం సరిహద్దులు దాటుతూనే వుంది.

వెంకటగిరి కొండ క్రింది గ్రామాలైన మొక్కలపాడు, పాళెంకోట తదితర ప్రాంతాల్లో అటవీశాఖ అధికారులు ముమ్మరంగా గాలింపు చేపట్టారు. మొక్కలపాడు వద్ద వ్యవసాయ బావిలో దాచిన 13 ఎర్రచందనం దుంగలను స్వాధీనం చేసుకొన్నారు. ఇలా గాలింపులు జరపడం, సమాచారం అందితే వాహనాలను సీజ్ చేయడం, దొంగలను కార్యాలయానికి తరలించడం మినహా అసలు సూత్రధారులను గాని, పాత్రధారులను గాని పట్టుకోలేకపోతున్నారు. ఇటీవల నెల్లూరు మీదుగా మిరపకాయలలోడు చాటున దుంగలు తరలిస్తుండగా పట్టుకొన్నారు. ఎక్కడ కూడా అధికారులు, సిబ్బంది ఎర్రచందనం దుంగలు పట్టుకొని ఫోటోలకు ఫోజులివ్వడం, లేదంటే డ్రైవర్, సిబ్బంది పరారయ్యారని ప్రకటించడం తప్ప పట్టుకొన్న దాఖలాలు లేవు.

## ముసునూరులో భూ ఆక్రమణ

కావలి పట్టణ సమీపంలో ముసునూరు వద్ద ఆర్ అండ్ బి రోడ్డు ప్రక్కనే వున్న 3 కోట్ల రూపాయల స్థలం ఆక్రమణకు గురైంది. కొందరు వ్యక్తులు బినామీ పేర్లతో దొంగపట్టాలు సృష్టించి అమ్మేస్తున్నారు. వాస్తవంగా ఈ స్థలం ఆర్అండ్‌బి శాఖకు సంబంధించింది. సర్వే నెంబర్ 912లో ఆ శాఖ భవిష్యత్తు అవసరాలకోసం రోడ్ల ప్రక్కనే ఎకరా 43 సెంట్ల భూమిని వదలిపెట్టింది. రెవెన్యూ రికార్డుల్లోనూ రహదారి పోరంబోకుగా నమోదైంది. గతంలో పలువురు ఆ స్థలం ప్రక్కనే ఇళ్ల నిర్మాణాలు చేపట్టినా ఈ స్థలం జోలికి ఎవరూ వెళ్ల లేదు. ఇప్పుడు కొందరు వ్యాపారుల కన్ను విలువైన ఈస్థలంపై పడింది. అంతే రాత్రికి రాత్రి బినామీ పేర్లతో దొంగపట్టాలు సృష్టించి అమ్మకానికి సిద్ధమయ్యారు. ఇంత బహిరంగంగా కోట్ల విలువ చేసే ప్రభుత్వ స్థలం కబ్జాకు గురైనా అధికారులు తమకేమి పట్టనట్లు వ్యవహరించడం విమర్శలకు తావిస్తోంది.

**కుంభకర్ణ నిద్రలో ఆర్అండ్‌బి**

## కలువాయి అభివృద్ధికి కృషి!

జిల్లాలో ఇసుక మాఫియా ఆగడాలను అణచివేసి ప్రభుత్వానికి కోట్ల రూపాయలు జమ అయ్యేలా చేశామని జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్ రెడ్డి తెలిపారు. కలువాయి మండలంలో కనుపూరుపల్లి, వెరుబోట్లపల్లి గ్రామాల్లో ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణతో కలసి పర్యటించారు. కనుపూరుపల్లిలో క్రొత్తగా నిర్మించిన రక్షిత మంచినీటి పథకాన్ని ప్రారంభించిన కాకాణి మాట్లాడుతూ ఇంత వరకు ఇసుక మాఫియా కోట్లాది రూపాయల అవినీతికి పాల్పడిందని ఆరోపించారు. 9 ఏళ్ల కాలంలో ప్రభుత్వానికి కేవలం 13కోట్లు మాత్రమే వసూలు కాగా, ఒక్క ఏడాదిలోనే ఇసుక రీచ్‌ల నుంచి 30 కోట్ల రూపాయలు వసూలు కావడం చూస్తే ఎంతగా అవినీతి జరిగిందో అర్థమవుతుందన్నారు. ఈ దోపిడీని ఇక సాగనివ్వమని స్పష్టం చేశారు. అనంతరం జరిగిన ప్రజాపథంలో పాల్గొన్న వీరిద్దరూ పార్టీలకు అతీతంగా స్థానిక నాయకులను కలుపుకొని కలువాయి మండల అభివృద్ధికి పాటుపడతామని హామీ ఇచ్చారు. కాకాణి, కురుగొండ్ల కలసి పాల్గొన్న కార్యక్రమానికి ఆనం వర్గం గైర్హాజరైంది. మంత్రి రామనారాయణ నుంచి అందిన ఫోన్ ఆదేశాలకు అనుగుణంగానే ఎంపిపి మంజారతీ, జడ్పీటిసి ఆదిలక్ష్మి, చిన్న బుజ్జిరెడ్డి, శివారెడ్డి తదితరులు డుమ్మాకొట్టినట్లు సమాచారం.

**జడ్పీఛైర్మన్ స్పష్టీకరణ**

## ఇస్కాను పరామర్శించిన పార్వతమ్మ

మాజీ ఎమ్మెల్యే మాగుంట పార్వతమ్మ ఇటీవల జలదంకి గ్రామంలో పర్యటించారు. గ్రామానికి చెందిన సీనియర్ కాంగ్రెస్ నేత అనారోగ్యానికి గురై చికిత్స పొందుతున్న ఇస్కా వెంకట్రామిరెడ్డిని పరామర్శించేందుకు పార్వతమ్మ రావడంతో కాంగ్రెస్ నేతలు పలువురు ఆమె వెంట వచ్చారు. ఈ సందర్భంగా ఆమె ఇస్కాను ఉద్దేశించి పెద్దాయనా ఎలా వుంది మీ ఆరోగ్యం అంటూ వాకబు చేశారు. ఎండలు తీవ్రంగా వున్నదృష్ట్యా జాగ్రత్తగా వుండాలని సూచించారు. అనంతరం మండలంలో పార్టీ స్థితిగతులపై ఆరా తీశారు. పార్వతమ్మ వెంట కావలి మాజీ మార్కెటింగ్ ఛైర్మన్ గ్రంధియానాదిశెట్టి, కొండారెడ్డి, మాలకొండారెడ్డి తదితరులు పాల్గొన్నారు.

● మాదన్నగారిపల్లెలో

## ఒక్క అంతస్తే...

**రెండోది కడితే ఇబ్బందులనే భావన**

ఎవరికి వారు తమ ఆర్థిక పుష్టిని బట్టి గృహాలు నిర్మించుకొంటారు. కలువాయి మండలం మాదన్నగారిపల్లెలో మాత్రం ఇళ్లన్నీ ఒక్క అంతస్తుకే పరిమితం అవుతాయి. ఊర్లో వున్న రైతులందరూ మోతుబరులే అయినా, రెండంతస్తుల మేడ కట్టగలిగిన స్థోమత వుండేవారైనా ఎవ్వరూ రెండో అంతస్తు జోలికెళ్లరు. రెండో అంతస్తు నిర్మిస్తే అరిష్టమని గ్రామస్తుల నమ్మకం. దీంతో గ్రామంలో ఎక్కడా పై అంతస్తు కన్పించదు. గ్రామంలో ఆలయం లేదని, అందువలన రెండో అంతస్తు కడితే అరిష్టమని చెప్పడంవల్ల నిర్మించాలని కోరిక వున్నా ఆవైపుగా ఎవరూ దృష్టి సారించరు. గతంలో ఒక రైతు రెండో అంతస్తు నిర్మిస్తుండగా కుటుంబం చిక్కుల్లో పడిందని ఆనాటి నుంచి ఇప్పటి వరకు ఎవరూ ఆ సాహసం చేయలేదని గ్రామస్తులు చెప్తున్నారు. సెంటిమెంటు కారణంగా ఊళ్లోని ఇళ్లన్నీ క్రింది అంతస్తుకే పరిమితమయ్యాయి.

## మమ్మల్ని పట్టించుకోరా?

**మండల సభలో ఎమ్పీటిసిల గోడు**

స్థానిక సంస్థలకు ప్రాతినిధ్యం వహిస్తున్న తమను కాదని సర్పంచులకు అధిక ప్రాధాన్యతనిస్తున్నారంటూ పలువురు ఎంపిటిసిలు అధికారులపై మండిపడిన వైనం ఇందుకూరుపేట మండల సర్వసభ్య సమావేశంలో చోటు చేసుకొంది. సమావేశం ప్రారంభం కాగానే సభ్యులు ఒక్కసారిగా లేచి తమ నిరసన తెలియజేశారు. గ్రామాల్లో అభివృద్ధికి సంబంధించి 50 వేల రూపాయల పనులు చేపట్టేందుకు ప్రభుత్వం ఎంపిటిసిలకు అధికారం ఇచ్చినా మండల అధికారులు ఆ ఆదేశాలను ఖాతరు చేయడం లేదని వారు విరుచుకుపడ్డారు. స్థానిక సర్పంచ్‌లకే పూర్తి అధికారాలు కట్టబెడుతూ తమను నిర్లక్ష్యం చేస్తున్నారని ఆరోపించారు. చివరకు ఎమ్మెల్యేలు పాల్గొనే కార్యక్రమాలకు సంబంధించిన కనీస సమాచారం ఇవ్వడం లేదని సభ్యులు అధికారులపై ప్రశ్నల వర్షం కురిపించారు. దీంతో సభలో గందరగోళం నెలకొంది. దీనికి ఎమ్పీడీవో చిరంజీవి సమాధానమిస్తూ ప్రభుత్వ ఆదేశాలకు అనుగుణంగానే పని చేస్తున్నామే తప్ప ఎంపిటిసిలను తక్కువ చేయడం లేదని చెప్పారు. ఎంపిపి రాధమ్మ, ఇతర మండలస్థాయి అధికారులు పాల్గొన్నారు.

## గ్రామదేవత జాతర

కలువాయి గ్రామదేవత కలువాయమ్మ జాతర ఉత్సవాలు మే 4 నుంచి వైభవంగా ప్రారంభమయ్యాయి. షుమారు 12 ఏళ్ల విరామం తర్వాత జరుగుతున్న ఈ ఉత్సవాలకు అధికసంఖ్యలో భక్తులు పాల్గొని మొక్కులు తీర్చుకొంటున్నారు. గ్రామానికి దక్షిణం వైపున వున్న అంకమ్మ రచ్చ వద్ద ఇనుకుంట అంకమ్మ జాతర జరిగింది. అలాగే ఊరంకమ్మ జాతర, పోలేరమ్మ జాతరలతోపాటు మే 30 నుంచి జూన్ 9 వరకు జరిగే కలువాయమ్మ, జూన్ 13 నుంచి 17 వరకు జరిగే గంగమ్మ జాతరతో ఉత్సవాలు ముగుస్తాయి. మండలంలోని వివిధ ప్రాంతాల నుంచి విచ్చేసే భక్తుల రద్దీని దృష్టిలో వుంచుకొని తగిన ఏర్పాట్లు చేస్తున్నట్లు నిర్వాహకులు తెలిపారు.

● సిఎం పర్యటన తర్వాత మార్పులు

# చిత్రవిచిత్రంగా కాంగ్రెస్ రాజకీయాలు!

ముఖ్యమంత్రి రోశయ్య నెల్లూరు పర్యటన తర్వాత జిల్లా రాజకీయాలలో చాలా మార్పులు కన్పిస్తున్నాయి. ఊహించని పరిణామాలు సిద్ధిస్తున్నాయి. వైఎస్ బ్రతికున్న కాలంలో ఆనం సోదరులు ఏకఛత్రాధిపత్యం అనుభవించారు. ముఖ్యమంత్రి తమ జేబులోని వస్తువన్నట్లు వ్యవహరించారు. తామనుకొన్నవన్నీ సాధించారు. కానీ రోశయ్య వచ్చిన తర్వాత పరిస్థితి మారిపోయింది. పార్టీ, ప్రభుత్వాలలో వారి మాటకు విలువ లేకుండా పోయింది. ఆదాల ప్రభాకర్‌రెడ్డి, జిప ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి రోశయ్యకు ఆంతరంగికులన్న అభిప్రాయం ఏర్పడింది. రాజీవ్‌భవన్ కళకళలాడింది. నెల్లూరు మేయర్ నందిమండలం భానుశ్రీ ఇంటి మీద ఎసిబి దాడితో ఆనం వారి పరువు గంగలో కలిసింది. మునిసిపల్ మంత్రి కూడా అయిన ఆనం రామనారాయణరెడ్డికి అణుమాత్రం సమాచారం లేకుండా ఆయనకు ఫైల్ రాకుండా భానుశ్రీ మీద విచారణకు ఆదేశించాడు ముఖ్యమంత్రి. ఆమె ఇంటి మీద ఎసిబి దాడికి అనుమతించాడు. ఆమె భర్త, విద్యుత్ శాఖ డిఇ సుబ్బరాజు పదిహేను రోజులు చర్లపల్లి జైలులో కాలం గడిపాడు. ఇవన్నీ ఆనం వారికి తీరని అవమానాలు. దానితో వారు ముఖ్యమంత్రి వద్దకు వెళ్లడానికి కూడా సంకోచించారు. మౌనంగా మనసులోనే కుమిలిపోయారు. ఈ అవకాశం చూసుకొని రాజీవ్‌భవన్ వారి మీద స్థానికంగా ఉధృతస్థాయిలో దాడి చేసింది. వారి బ్రతుకుల బండారాన్ని బట్టబయలు చేసింది. అధికారులు కూడా వారిని దూరం పెట్టారు.

## గుడారం ఆక్రమించారు

ఈ నేపథ్యంలో రోశయ్య నెల్లూరు వచ్చాడు. రాజకీయాలలో ఏ ఎండకాగొడుగు పట్టడంలో, ఎప్పటికెయ్యది ఉచితమో దాన్ని అమలు చేయడంలో ఆనం వారి ప్రజ్ఞ అపారం. అలివైతే కాళ్లతో ఎగిసి తన్నడం, అనువు కాదనుకొన్నప్పుడు వాటేసి కాళ్లు పట్టుకోవడం వారికే చెల్లు. అంతవరకు తమను వెలివేసినవారి వలె చూసిన ముఖ్యమంత్రిని అమాంతం కౌగిలించుకొన్నారు. ఆయన కారు డోరు తీశారు. పంచె జారితే సవరించారు. ఇంటికి తీసుకవెళ్లి అన్నం పెట్టారు. ఆయన జిల్లాలో వున్నంతసేపూ వెన్నంటే వుండి పరిచారకుల వలె సేవలు చేశారు. ఈ ఉపాయం మంచి ఫలితాలే ఇచ్చింది. ముఖ్యమంత్రి వారి పట్లనే ఒక పిసరు మొగ్గు చూపాడు. ఇంకేముంది, తలదూర్చే సందిస్తే గుడారమంతా ఆక్రమించుకొనే ఒంటె చందంగా జిల్లా రాజకీయాలలో మరొకసారి విజృంభిస్తున్నారు. ఈ మధ్య కాలంలో తమను అవమానాలకు గురి చేసిన ఆదాల ప్రభాకర్‌రెడ్డి, కాకాణి గోవర్ధన్‌రెడ్డి, అనిల్‌కుమార్ యాదవ్, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి తదితరుల మీద నేరుగా దాడి మొదలు పెట్టారు. పరోక్షంగా నేదురుమల్లి జనార్ధనరెడ్డిపై కూడా విసుర్లు వేస్తున్నారు.

## గుడి పెత్తనం

నెల్లూరు నగరానికి చెందిన రంగనాయకుల స్వామి, మూలాపేట శివాలయాలకు ధర్మకర్తల మండలి నియామకంలో పైచెయ్యి సాధించడం ఆనం వారికొక అనుకూల అంశం. ఈ రెండు గుడులు నెల్లూరు నగర నియోజకవర్గంలో వున్నాయి. అనిల్ కుమార్ ఇక్కడ నియోజకవర్గ ఇన్‌ఛార్జ్. వైఎస్ పెట్టిన సాంప్రదాయం ప్రకారం ఓడిపోయిన అభ్యర్థుల అభిమతం ప్రకారమే ఆ నియోజకవర్గ నిర్ణయాలు జరగాలి. కానీ జిల్లా ఇన్‌ఛార్జి మంత్రి మోపిదేవి వెంకటరమణను లోబర్చుకొని, ఈ రెండు గుడులకు తమ మనుషులను నియమింప చేసుకొన్నారు. ఆదాల ప్రభాకర్‌రెడ్డి బృందానికి ఇది కొంత ఆశాభంగం. నెల్లూరు నగరంలో కూడా తమదే పైచెయ్యి అనిపించుకొన్నాము కాబట్టి రేపటి కార్పొరేషన్ ఎన్నికలలో కూడా టిక్కెట్ల పంపకం తమ ఇష్టానుసారం జరుగుతుందనే సంకేతం ఇవ్వడానికి ప్రయత్నిస్తున్నారు ఆనం సోదరులు.

## మంత్రికీ నోటి దురుసు

సాధారణంగా వివేకానందరెడ్డి వదరుబోతుతనానికి పెట్టింది పేరు. నోటికి ఏది వస్తే అది మాట్లాడేస్తాడు. తనను జనం వికృతానందరెడ్డి,

కొరవ 16వ పేజీలో

---

## స్పెషల్ 'సిఎస్' ప్రమోషన్లలో తలనొప్పులు

స్పెషల్ చీఫ్ సెక్రటరీ ప్రమోషన్లలో రోశయ్యకు తలనొప్పులు ఎదురవుతున్నాయి. వై.ఎస్‌కు ప్రిన్సిపల్ సెక్రటరీగా సేవలందించిన జన్నత్‌హుస్సేన్ ప్రస్తుతం రోశయ్య పేషీలో కూడా అదే స్థానంలో కొనసాగుతున్నాడు. మరో అయిదు నెలల్లో జన్నత్ రిటైర్డ్ కాబోతున్నాడు. జన్నత్‌కు నజరానాగా చీఫ్ ఇన్‌ఫర్మేషన్ కమిషనర్ పోస్టు రోశయ్య నిర్ణయించారు. ఆ పోస్టులో జన్నత్‌ను నియమించడానికి ఆయనకు స్పెషల్ చీఫ్ సెక్రటరీ ప్రమోషన్ అవసరం. అయితే లిస్టులో జన్నత్ చివరివాడుకావడంతో ప్రమోషన్‌కు ఇబ్బందులెదురవుతున్నాయి. సీనియర్ అయిన షఫీక్ ఉజ్జమాన్, 'జన్నత్' ప్రమోషన్‌కు కాలడ్డుతున్నాడు. దీంతో ఈ నెల 10వ తేదీన జరగాల్సిన ప్రమోషన్ కమిటీ సమావేశం 13కు వాయిదాపడింది. జన్నత్‌కు ఒకవేళ ప్రమోషన్ యిచ్చినా తాను ఊరుకునేది లేదంటూ 'షఫీక్' కారాలు మిరియాలు నూరుతున్నాడు.

## ఎవరా మధుకోడాలు?

రాజధానిలో ఇప్పుడు ఎక్కడ చూసినా తెలుగు మధుకోడాల గురించే మాట్లాడుకుంటున్నారు. రాష్ట్రమంత్రివర్గంలో మధుకోడాలు వున్నారంటూ ఎమ్మీ రాయపాటి సాంబశివరావు ఆరోపించడంతో తీగ కదిలింది. గుంటూరుజిల్లా రాజకీయాల్లో మంత్రి కన్నా లక్ష్మీనారాయణకు, రాయపాటికి మధ్య ఉప్పు – నిప్పులా వుంది. కన్నా వందల కోట్లు గడించి తమపై ఆధిపత్యం చేస్తున్నాడన్న ఆరోపణను ప్రతిపక్షాలు సీరియస్‌గా తీసుకొని 'మధుకోడాల'పై విచారణ జరిపించాలని పట్టుబడుతున్నాయి. ఈ విషయం కాస్తా అధిష్టానం దాకా పోయింది. ఏమిటీ తలనొప్పి అంటూ అధిష్టానం నుంచి రోశయ్యకు వర్తమానం అందింది. దీంతో రోశయ్య రంగంలోకి దిగి ఉభయవర్గాల మధ్య బుజ్జగింపుల కార్యక్రమాన్ని చేపట్టాడు. ఇంతకూ రాష్ట్రమంత్రుల్లో ఎంతమంది మధుకోడాలు వున్నారో ? ప్చ్ !!

## సిఎం పేషీలో 'తకరారు'

సిఎం పేషీలో 'సీనియర్లు' ఎక్కువకావడం రోశయ్యకు సమస్యగా మారింది. అధికారాల పంపకంలో వారి మధ్య అసంతృప్తులున్నాయట. సిఎం పేషీలో కార్యదర్శిగా వున్న దినేష్‌కుమార్ రోశయ్య సామాజికవర్గానికి చెందినవాడు. దినేష్‌కుమార్‌కు సీనియర్ సెక్రటరీ రాజుకు మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటోంది. రాజుకు అధిష్టానం వద్ద పలుకుబడి బాగా వుంది. రాహుల్ గాంధీతోపాటుగా ప్రధాని మన్మోహన్‌తో ఆయన ఎప్పుడూ 'టచ్'లో వుంటాడు. అటు సొంత సామాజికవర్గానికి చెందిన దినేష్‌ను వెనకేసుకువస్తే రాజుకు ఎక్కడ కోపం వస్తుందోనని రోశయ్య భయపడుతున్నాడు. అందుకే దినేష్‌ను రాజును కూర్చోపెట్టి 'సంధి' చేశాడట. అయినా కూడా ఐఎఎస్ 'ఇగో'ల మధ్య సిఎం పేషీ సతమతమవుతూనే వుందని అభిజ్ఞవర్గాల భోగట్టా. పాపం రోశయ్యకు కనీసం 'పేషీ'లో కూడా సుఖం లేకుండా పోయింది.

## వియ్యాలవారి కయ్యాలు!

అధికారం కోసం వియ్యంకుల మధ్య కయ్యం మొదలైంది. తెలుగుదేశం పార్టీలో చంద్రబాబు, బాలకృష్ణల వ్యవహారం ఇప్పుడు హాట్‌టాపిక్‌గా మారింది. 'సింహా' చిత్రం హిట్ కావడంతో బాలకృష్ణ నూతనోత్సాహంతో వున్నాడు. దేవుడు కరుణిస్తే రాజకీయాల్లో కూడా హిట్ కొడతానంటున్నాడు. ఇప్పుడు బాలకృష్ణ ఎక్కడకు పోయినా కాబోయే ముఖ్యమంత్రి అంటూ తెలుగు తమ్ముళ్లు నినాదాలు చేస్తున్నారు. బాలకృష్ణ కూడా దానికి తగినట్లుగానే తలూపుతున్నాడు. ఇదంతా చంద్రబాబుకు తలనొప్పిగా మారింది. తెలుగుదేశం తెరపై ఎన్టీఆర్ కుటుంబంలో తానొక్కడే వుంటానికి వీలుగా బాలకృష్ణతో, జూనియర్ ఎన్టీఆర్‌తో 'వియ్యం' కుదుర్చుకున్నాడు. తీరా ఇప్పుడు ఆ వియ్యం కయ్యంగా మారుతుండడాన్ని 'బాబు' జీర్ణించుకోలేకపోతున్నాడు.

# విలక్షణుడు 'పరశురాముడు'!

శ్రీ మహావిష్ణువు దశావతారాల్లో ఆరవదైన పరశురామావతారం విలక్షణమైనది, ఇతర అవతారాలలోకెల్లా భిన్నమైన తాత్వికత కల్గినది.

పరశురాముడు వైశాఖ శుక్ల తృతీయనాడు జన్మించినట్లు స్కంద, బ్రహ్మాండ పురాణాలు పేర్కొంటున్నాయి. పరశురాముని తల్లి రేణుక, తండ్రి జమదగ్ని. దత్తాత్రేయుని వద్ద శిష్యునిగా చేరి అనేక విద్యలు నేర్చుకొన్నాడు భార్గవ రాముడు. శివుడ్ని మెప్పించి ఆయన నుంచి అఖండ పరశువును (గండ్రగొడ్డలి) పొంది పరశురాముడై అజేయ పరాక్రమవంతుడిగా నిలిచాడు.

చిత్రరథుడనే గంధర్వుడుని చూసి రేణుక మనసు చలించిందని యోగదృష్టితో గ్రహించిన జమదగ్ని ఆమె శిరసును ఖండించవలసినదిగా పరశురాముని ఆజ్ఞాపిస్తాడు. తండ్రి మాటని జవదాటని పరశురాముడు తల్లి తలను నరికి తండ్రైన జమదగ్ని మెప్పు పొందుతాడు. అనుగ్రహించి వరం కోరుకోమని తండ్రి అవకాశం ఇస్తే తల్లిని బ్రతికించమనగా జమదగ్ని అనుగ్రహిస్తాడు.

ఇంద్రాది దేవతలు దానవుల వల్ల తమకు వాటిల్లుతున్న ఇబ్బందులను శివుడికి మొరపెట్టుకొంటే, ఆ పరమేశ్వరుడు పరశురాముని పిలిచి శివతేజస్సు ఆయనలో ప్రవేశపెట్టి పరశువు ద్వారా రాక్షస సంహారం చేయిస్తాడు. ఆ తర్వాత పరశురామునికి నిశ్చలభక్తిని, భార్గవాస్త్రాన్ని అనుగ్రహిస్తాడు శివుడు.

హైహయ వంశీయుడైన కార్తవీర్యుడు జమదగ్ని ఆశ్రమం నుంచి కామధేనువును అపహరించగా పరశురాముడు అతన్ని హతమారుస్తాడు. కార్తవీర్యుని పుత్రులు పరశురాముడు లేని సమయంలో జమదగ్ని తల నరికివేస్తారు. రేణుక దు:ఖంతో 'నీ తండ్రి లేడని' 21మార్లు ఆక్రోశించగా కార్తవీర్యుని పుత్రులనే కాక, 21 మార్లు భూమండలమంతా తిరిగి క్షత్రియులందరినీ చంపివేసినట్లు పురాణాలు చెప్తున్నాయి.

భూమినంతటినీ కశ్యపునకు దానమిచ్చిన తర్వాత తపస్సుకు చోటులేక పరశువును సముద్రంలోకి విసరగా సముద్రుడు గౌరవంతో వెనక్కు తగ్గాడని, ఆ ప్రదేశమే కేరళని పురాణ కథనం. పరశురాముడు పూర్ణావతారుడు కాదని, అవశేషావతారం అనీ అందుకే స్తోత్రాలు, మందిరాలు చాలా తక్కువ అని అభిప్రాయం. కేరళ తిరువనంతపురం వద్ద తిరువళ్లంలో కరమణ నది ఒడ్డున పురాతన పరశురామ మందిరం వుంది.



మే 16తేది పరశురామ జయంతి

## ట్రంకు రోడ్డు

### మీరే నా ప్రాణం



అప్పుడప్పుడు రాజకీయ నాయకులు నిజాలను తమ నోటి నుంచి కక్కేస్తుంటారు. రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి నెల్లూరులో మీడియాకు ప్రభుత్వం ఇచ్చిన ఇళ్లస్థలాల దస్తావేజుల పంపిణీ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా విచ్చేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ పాత్రికేయులే రాజకీయనాయకులకు ప్రాణం పోస్తారు. పత్రికల్లో నాకు అనుకూలంగా వార్తలు వస్తే బాగా సంతోషిస్తాను. వ్యతిరేకంగా వస్తే బాధపడతాను. అప్పుడప్పుడు మాత్రం నాపై సంధించిన విమర్శల్లోని వాస్తవాలు తెలుసుకొంటుంటానన్నారు. పాత్రికేయులను మించిన ఆత్మీయులు లేరని, ఫోటో, వీడియోగ్రాఫర్లంటే తనకెంతో ఇష్టమని తెగ పొగిడి వుబ్బించారాయన.

### రామనారాయణ దబాయింపు



తనను గెలిపించిన ఆత్మకూరు ప్రజలకు పురపాలకశాఖ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి అందుబాటులో వుండడం లేదని విమర్శగా వుంది. దీన్ని కప్పిపుచ్చుకోను ఈ వారంలో ప్రజాపథం కార్యక్రమంలో పాల్గొనను స్వంత నియోజకవర్గానికి వెళ్లిన ఆయన అధికారులపై కస్సుబుస్సులాడారు. మహిమలూరు చెరువు పనులు చేపట్టని ఇరిగేషన్, ఉపాధిహామీ పథకం కార్యక్రమాలను పర్యవేక్షించే అధికారుల నుద్దేశించి ఉపాధిహామీ క్రింద పనులు ఇవ్వకపోతే అధికారులను జైల్లో పెట్టించవచ్చని చట్టం చెబుతుంది. ఈ చట్టాన్ని అధికారులు నిత్యం మననం చేసుకోవాలని దబాయించారు. ప్రజలు ఏ పనులు కోరితే ఆ పనులను ఉపాధిహామీలో చేర్చాలన్నారు. ప్రజలు కోరిన పనులు పాలకులు, అధికారులు చేస్తే స్వాతంత్ర్యం వచ్చి 60 ఏళ్లు దాటినా ఇంకా పల్లెల్లో ప్రాథమిక సౌకర్యాలు సైతం ఎందుకు ఒనకూడలేదో అమాత్యులకు తెలియదా?

### ప్రెస్‌మీట్లతో ఎస్పీ బిజీ...



మామూలుగా జిల్లా కలెక్టర్, ఎస్పీలు ఏదైన ముఖ్య విశేషాలుంటే ప్రెస్‌మీట్లు పెడుతుంటారు. ప్రస్తుత జిల్లా కలెక్టర్ రాంగోపాల్ మాత్రం అరుదుగానే మీడియాతో మాట్లాడుతారు. కాని ఎస్పీ ఈతముక్కల దామోదర్ మాత్రం దీనికి విరుద్ధం. జిల్లాలో ఇంతకు మునుపు ఏ ఎస్పీ పెట్టని రీతిలో దినం మార్చి దినం ప్రెస్‌మీట్లు పెడుతుంటారు. సబ్‌యిన్స్‌పెక్టర్ మండల కేంద్రాల్లో మోటారు స్కూటర్ దొంగలను పట్టుకున్న విషయాలపై కూడా జిల్లా కేంద్రంలో ప్రెస్‌మీట్ పెడతారాయన. నెల్లూరులో వుంటే మీడియాతో తప్పనిసరిగా మాట్లాడే రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డితో ఎస్పీ ప్రెస్‌మీట్లు పెట్టే వ్యవహారంలో పోటీ పడుతున్నట్లుగా వుంది పరిస్థితులు చూస్తుంటే. ప్రెస్‌మీట్లతో నిత్యం పేపర్లు, టివీల్లో వుండాలని ఎస్పీ తలపోయడం లేదు కదా?

### రామదూత పూజలు



ఈ మధ్య వార్తల్లో వెలుగుతున్న స్వామిగా నెల్లూరు – ప్రకాశం జిల్లాల సరిహద్దుల్లో చేవూరు ఆశ్రమం నిర్వహిస్తున్న రామదూతస్వామిని పేర్కొనవచ్చు. కర్నాటక ముఖ్యమంత్రి యడ్యూరప్ప, రైల్వేమంత్రి మునియప్పన్, రాష్ట్ర డిజిపి గిరీష్‌కుమార్ వంటి వివిఐపిలు ఈ ఆశ్రమానికి రావడంతో రామదూత స్వామికి పేరొచ్చింది. దీంతో ఆశ్రమంలో వుండే స్వామి తరచూ బయటకు వచ్చి పూజలు, వత్రాలు చేస్తున్నారు. మే 2తేది నెల్లూరుకు వచ్చిన రామదూతస్వామి 9తేది కొండ బిట్రగుంటలో ప్రత్యేక పూజల్లో పాల్గొన్నారు. ఎండలను సైతం లెక్క చేయక భక్తులు ఈ పూజలు, వత్రాల్లో పాల్గొనడమే కొసమెరుపు.

### కరివేపాకునయ్యా!...



రాయినైనా కాకపోతిని గీతాలాపనకు పేరడీగా కరివేపాకునయ్యా... పాట పాడుతుంది నెల్లూరు 21వ డివిజన్ కార్పొరేటర్ వేల్పుల రజని. ఆమె తెలుగుదేశం కార్పొరేటర్‌గా గెలిచినా రూరల్ ఎమ్మెల్యే వివేకా పెట్టిన ప్రలోభాలకు సులభంగా లొంగి జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డిపైనే ఆత్మహత్యాయత్నం కేసు పెట్టి వార్తల్లో వెలిగిన వనిత. భానుశ్రీ మేయర్ అయిపోయాక ఇటువంటి కార్పొరేటర్లను వివేకా పట్టించుకోవడం మానేశాడు. దీంతో రాజీవ్‌భవన్ మెట్లెక్కింది రజినమ్మ. ఈ సందర్భంగా మీడియాతో మాట్లాడుతూ ఆయన (వివేకా) నన్ను కరివేపాకులా వాడుకొన్నారు. ఇప్పుడేమో నా డివిజన్‌లో నన్ను గాక మరొకరిని ప్రోత్సహిస్తున్నారు. వివేకానందరెడ్డి నన్ను తెగ తిట్టారు. ఓ అన్న చెల్లెలకు పెట్టిన తిట్ల సారెగా దీన్ని భావిస్తున్నానని వేదాంతం వల్లించారు వేల్పుల రజని. రాజకీయాల్లో చేసుకొన్నవాళ్లకు చేసుకొన్నంత అనే దానికి రజని వ్యవహారం ఒక ఉదాహరణగా చెప్పుకోవచ్చు.




నూతనమిత్రులు ఏర్పడతారు. కీళ్ల బాధలుంటాయి. దూరదేశ ప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. గృహాలంకరణలో శ్రద్ధ చూపుతారు. సోదరుల మూలంగా ధననష్టం. స్థలం మార్పులకు సంబంధించిన ప్రయత్నాలు చేస్తారు. ఆర్థిక లావాదేవీలు మీకు అనుకూలంగా ఉంటాయి. మాతృసంబంధీకుల తోడ్పాటు చక్కగా ఉంటుంది. నూతన ఉద్యోగప్రయత్నాలు ఫలిస్తాయి.




సోదరులకు సంబంధించిన శుభవార్తాశ్రవణం. వాహనాలు కొనడం, లేదా సరి చేయించడం ఉంటుంది. దూరదేశాల నుండి ప్రియమైన విషయాలు వింటారు. వసతిగృహ మార్పిడులకు అవకాశాలున్నాయి. స్పెక్యులేషన్ లాభిస్తుంది. వ్యాపారంలో పోటీనెదుర్కొంటారు. కొత్తఖాతాదారులు ఏర్పడే అవకాశం కలదు. ఖర్చులు కూడా అధికం. పనులు నిదానంగా సాగవచ్చు.




చాలకాలంగా వాయిదా పడతున్న పనులను పట్టుదలతో పూర్తి చేస్తారు. పిల్లలవిషయాల్లో పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. స్పెక్యులేషన్ విషయాలు మేలు. వృత్తిలో మార్పులు జరిగే అవకాశాలున్నాయి. ఆర్థిక లావాదేవీలు మీకు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణాలలో విఘ్నాలుంటాయి. వ్యాపారులకు భాగస్వాముల మూలంగా మంచి లాభప్రాప్తి ఉంటుంది.




పెద్దల ఆరోగ్య పరిస్థితి మెరుగుపడుతుంది. పై అధికారుల వైఖరివల్ల మనశ్శాంతి కొరవడుతుంది. రాజకీయ, ఆధ్యాత్మిక రంగాలకు చెందిన ప్రముఖులను కలుసుకొంటారు. పెట్టుబడులపై ముఖ్య నిర్ణయం తీసుకొంటారు. కళత్రసంబంధం బాగుండదు. ఉద్యోగంలో నూతన బాధ్యతలు అధికం. విసుగును తెప్పిస్తాయి. అన్ని రంగాల్లో వివిధ మార్పులుంటాయి.




ఆర్థికవిషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. పట్టుదలతో లక్ష్యాలు సాధిస్తారు. కొత్త ఆలోచనలు తోస్తాయి. మిత్ర సోదరుల ద్వారా అనుకొన్నవి పూర్తి చేసుకొంటారు. నూతన వస్త్రాభరణాలకై వెచ్చిస్తారు. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. ఖర్చుకు వెరవరు. వృత్తిలో అలసట ఎక్కువ. నూతన వ్యక్తుల పరిచయాలు ఏర్పడతాయి. వేడుకలు, శుభకార్యాల్లో పాల్గొంటారు.




ప్రముఖులతో కలసి విందుల్లో పాల్గొంటారు. బృందకార్యక్రమాలు, పౌరసంబంధాలు బాగుంటాయి. సహోద్యోగులు పై అధికారుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. భూ సంబంధిత ప్రశ్నలు, సమస్యలు ఒక కొలిక్కి వస్తాయి. చిరకాలంగా ఎదురు చూసిన వేతనాదుల గురించి శుభవార్త వింటారు. కళత్రసంబంధాలు కొంత మెరుగు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు.

# వారఫలాలు

*తేది 15–05–2010 నుండి 21–05–2010 వరకు మేషంలో బుధుడు; వృషభంలో రవి; మిథునంలో శుక్రుడు, కేతువు; కర్కాటకంలో కుజుడు; మీనంలో గురువు; కన్యలో శని; ధనుస్సులో రాహువు; వృషభ, మిథున, కర్కాటక, సింహాల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

### శుభ ముహూర్తాలు

20తేదీ వివాహాదులకు ఉ.5.14 గం.ల నుండి 7.14 వరకు మేష లగ్నాన.
16తేది అక్షయ తదియ, పరశురామ జయంతి, సింహాచలంలో చందనోత్సవం.
18తేది ఆదిశంకరాచార్య జయంతి.
19తేది రామానుజ జయంతి.
21తేది రాజీవ్‌గాంధి వర్ధంతి.

### మే తిథులు

**నిజ వైశాఖ శుద్ధ**

| | | | |
|---|---|---|---|
| 15 శని | విదియ | తె.3.59 | గం.ల.వ |
| 16 ఆది | తదియ | రా2.19 | గం.ల.వ |
| 17 సోమ | చవితి | రా.12.27 | గం.ల.వ |
| 18 మంగళ | పంచమి | రా.10.25 | గం.ల.వ |
| 19 బుధ | షష్ఠి | రా.8.18 | గం.ల.వ |
| 20 గురు | సప్తమి | సా.6.07 | గం.ల.వ |
| 21 శుక్ర | అష్టమి | సా.3.55 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com




పెట్టుబడులు లాభిస్తాయి. డిపాజిట్లు, అడ్వాన్సులు, చేతికి అందుతాయి. ఆశించిన డబ్బు అందుబాటులోనికి వస్తుంది. ధర్మ కార్యాల్లో పాలు పంచుకొంటారు. వ్యాపారులకు భాగస్వాముల మూలంగా మంచి లాభప్రాప్తి ఉంటుంది. వృత్తిపరులు తమ మూర్ఖతవల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. దూరదేశప్రయాణావకాశాలు కానవస్తున్నాయి.




గృహాలంకరణలో శ్రద్ధ చూపుతారు. వ్యాపారవృద్ధి చక్కగా సాగుతుంది. వ్యాపార విస్తరణకు నూతన ప్రయత్నాలు చేస్తారు. వృత్తిరీత్యా ఉత్సాహం, శ్రమ, ధనాదాయం అధికమవుతుంది. కళత్ర సుఖం చక్కగా ఉంటుంది. సంతానమూలంగా సుఖ శాంతులు కానవస్తాయి. ధనాదాయం చక్కగా ఉంటుంది. స్పెక్యులేషన్ కూడా లాభిస్తుంది. పౌరసంబంధాలు బాగుంటాయి.




దీర్ఘకాలంగా వాయిదా పడుతున్న పనులు పూర్తి జేస్తారు. బాంకులు, ఆర్థికసంస్థలతో పనులు పూర్తి అయి కోరిన ధనసహాయం అందుతుంది. జీవితభాగస్వామితో షాపింగ్, ఉల్లాస ప్రయాణం చేస్తారు. పౌరసంబంధాలు చక్కగా వుంటాయి. వ్యాపారులు మోసపోయే అవకాశాలున్నాయి జాగ్రత్త. అలసట శ్రమ ఉంటుంది. ఆహార విషయంలో జాగ్రత్త లేకుంటే ఆరోగ్యభంగావకాశాలు.




ధనవిషయంలో తెలివిగా ప్రవర్తించాలి. ఆర్థిక విషయాలు అంతంతమాత్రమే. ఇరుగుపొరుగు వారి సహాయం అందవచ్చు. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు బాగుంటాయి. వాహనాలు నడిపే సమయంలో జాగ్రత్త అవసరం. కీళ్ల బాధలుంటాయి. దూరదేశప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. గృహాలంకరణలో శ్రద్ధ చూపుతారు.




దగ్గరి ప్రయాణాలు ఫలవంతమవుతాయి. విరామ కాలక్షేపాల్లో పాల్గొంటారు. దీర్ఘకాలిక పెట్టుబడులు మంచి ప్రతిఫలాలనిస్తాయి. ఇష్టులైన వారితో కాలక్షేపం బాగా సాగుతుంది. పిల్లల విద్యావిషయాల్లో శుభపరిణామాలు చోటు చేసుకొంటాయి. ప్రేమానుబంధాలు బలపడతాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. సమాజంలో ముఖ్యులయినవారితో కలయిక ఏర్పడుతుంది.




ధైర్యంతో, ఆత్మవిశ్వాసంతో పనులు జరుపుకొంటూపోతారు. ఇంతకుముందు ఆటంకాలతో వాయిదా పడ్డ పనులు త్వరగా పూర్తి చేస్తారు. ధార్మిక విషయాలకు అనుకూలమైన రోజు. పిల్లలకోసం విలువైన వస్తువులు కొంటారు. ప్రేమ విషయాలు ఫలిస్తాయి. స్పెక్యులేషన్ లాభకరంగా ముగుస్తుంది. ఆర్థిక లావాదేవీలు లాభిస్తాయి. గృహసంబంధమైన వస్తువులు కొంటారు.

# ఒక వీధికి మించి రోడ్లుంటే 'వాతాపి' దృష్టి!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*గురజాల ఫ్రాన్సిస్ — కావలి*

** మా యింటికి మూడు రోడ్లున్నాయి. ఎంత సంపాదించినా నిలవడు.*

గృహానికి 'ఒకే' రోడ్డు ఉత్తమం. అంతకు మించి రోడ్లుంటే దిష్టి దోషం, వేధ, కోణ ఫలితాలుంటాయి. దీన్ని 'వాతాపి' దృష్టి అంటారు. ఇవి సమస్యాత్మకం.

*డి.ఉమాదేవి — నాయుడుపేట*

** అమ్మాయి వివాహం పెద్ద సమస్య అయింది. అర్హతలన్నీ వున్నాయి?*

జాతకం, ప్లాను చూశాను. ప్లానులో ఉత్తర, దక్షిణ దిశాదోషాలెక్కువ. జాతకం ప్రకారం 'మత్స్య యంత్ర' ప్రతిష్ట చేసుకొని వైఢూర్య(ద్వితీయ శ్రేష్ఠ) బుధాంగుళీయానికి ధరింపజేయండి.

*సయ్యద్ నసీమాబేగం — నెల్లూరు*

** స్థలం తొంభై డిగ్రీలలో గాక నూటయిరవై డిగ్రీలలో తిరిగి వుంది. తీసుకోవచ్చా?*

స్థలం మూలలు చూస్తున్నప్పుడు నిర్మాణం జరిగితే యజమాని అనారోగ్యంపాలై, మృత్యువుకు దగ్గరవుతాడు గనుక తీసుకోవద్దు.

*ఇ.వి.రాజశేఖరరెడ్డి — ఆత్మకూరు*

** నాలుగు రోడ్ల కూడలి ప్రాంతంలోని ఇళ్లు, అంగళ్లపై ఏ ప్రభావం వుంటుంది?*

నాలుగు రోడ్ల కూడలిని 'కూడలి కుంభస్థ కేంద్రం' అంటారు. ఈ ప్రాంతంలోని వారికి ఆకస్మిక సమస్యలు, భార్యా అనారోగ్యాలు, పుత్రికా కలహాలు ఎక్కువగా వుంటాయి.

*పిచ్చికుంట్ల సీతారామయ్య — కడప*

** పూజలు, యంత్ర ప్రతిష్ట చేయించాను. అయినా ప్రయోజనం లేదు.*

మొదట నమ్మకం వుండాలి. మీ ఉత్తరాన్ని బట్టి మీలో చిత్తశుద్ధిలేదని, ఆరోపణల మనస్తత్వం ఎక్కువని అర్థమవుతోంది. ఇట్లా వుంటే జన్మలో బాగుపడటం జరగదు.

*పి.దమయంతి — నెల్లూరు*

** నాలుగైదు సంవత్సరాలుగా ఆదాయం బాగా తగ్గిపోయింది. ఏమిచేయాలి?*

కేతు స్థితి వ్యతిరేకత మీకు మరికొంతకాలం కొనసాగనుంది. మీరు వ్యాపారంలో జోక్యం చేసుకోవడం మానండి.

*వై.ఆర్.శంతనరావు — బెంగుళూరు*

** స్థలంలో అమ్మాయికి కూడా భాగం యివ్వాలనుకుంటున్నాను.*

శాస్త్రాలు ఒప్పుకున్నప్పటికి, సమాజంలో ఈ విషయంలో అపోహలున్నాయి. అందువల్లే మీ గృహానికి సమీపంలో వేరే స్థలం కొని యివ్వండి.

*ఎస్.మేరీథామస్ — నెల్లూరు*

** ఈశాన్యం కోణం నైరుతి కోణం ఒకటే. అయితే ఉత్తర, దక్షిణాల కొలతల్లో చాలా తేడాలున్నాయి?*

వ్యాపార సంస్థ వివిధ కోణాలతో నిర్మితమవుతున్నదని అర్థమవుతున్నది. ఫలితంగా కుబేర స్థానం పతనం, దక్షిణ దిశావిస్తృతి వల్ల యజమాని ఆర్థిక, ఆరోగ్యాలలో విపరీతంగా నష్టపోతాడు.

*కె.ప్రతాప్‌రెడ్డి — సికింద్రాబాద్*

** నాలుగు రోడ్ల కూడలిలో వ్యాపార సంస్థ వుంది. ఆర్థికం ఎక్కడ వేసిన గొంగళి అక్కడేలా వుంటుంది.*

ఉత్తర వాయువ్య వీధిపోటు షాపుకు బాగా తగులుతోంది. యంత్ర ప్రతిష్ట చేసి చూడండి. సంవత్సరం తర్వాత పరిస్థితి మారకుంటే అంగడి ఖాళీ చేయడం మంచిది.

*జె.శివశంకరరావు — తడ*

** ఊరి బయట ప్లాటు వేస్తే నేనే మొదట గృహ నిర్మాణం చేశాను. ఆవిడ మానసిక స్థితి బాగోలేదు.*

ఇలాంటి స్థలాల్లో 'శక్తియంత్ర' ప్రతిష్టచేసి నిర్మాణం ప్రారంభించాలి. ఇప్పుడిక సైకియాట్రిస్టుకు చూపించి ఆ తర్వాత 'కనక పుష్యరాగం' (త్రివస్థ) ధరింప జేయండి.

# వింజమూరులో మంచినీటికి కటకట!

వింజమూరు గ్రామ పంచాయితీ అభివృద్ధి పనుల విషయంలో బాగా వెనుకబడి పోయింది. గ్రామ పంచాయితీకి ప్రతి సంవత్సరం లక్షలాది రూపాయల నిధులు సమకూరుతున్నా ప్రజలకు అవసరమైన పనులు చేపట్టడంలో పంచాయితీ పాలకవర్గం ఆసక్తి చూపడం లేదు. పంచాయితీ పరిధిలో త్రాగునీరు, డ్రైనేజి కాల్వలు, పారిశుధ్యం, వీధిలైట్ల సమస్యలు పట్టిపీడిస్తున్నాయి. ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను విన్నవించేందుకు ఎవరూ అందుబాటులో వుండడం లేదన్నది ప్రజల వాదన.

వింజమూరు గ్రామ పంచాయితీ సర్పంచ్‌గా తెలుగుదేశం పార్టీకి చెందిన గణపం బాలగురవారెడ్డి ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఇటీవల కొంత కాలంగా సర్పంచ్‌కు ఆరోగ్యం సరిగా లేకపోవడంతో ఉప సర్పంచ్ వెంకటేశ్వర్లు పంచాయితీకి సంబంధించిన అన్ని బాధ్యతలు నిర్వహిస్తున్నారు. పంచాయితీ పరిధిలో 21 వార్డులున్నాయి. ఈ పంచాయితీ పరిధిలోని ప్రతి కాలనీలో అనేక సమస్యలు స్వాగతం పలుకుతున్నాయి. ఎస్సీ, ఎస్టీ, బిసి, ముస్లిం కాలనీలలో ప్రధానంగా త్రాగునీటి ఎద్దడి నెలకొనివుంది. అసలే మెట్ట ప్రాంతం, త్రాగేందుకు గుక్కెడు మంచినీళ్లు అందించలేని దుస్థితిలో పంచాయితీ పాలకవర్గం వుంది. పలు కాలనీల ప్రజలు అనేక దఫాలు నీటి ఎద్దడిపై పాలకులకు విన్నవించుకున్నా ఫలితం లేకుండా పోయింది.



**త్రాగునీటి సమస్య!**

ఊరికి శివారున వున్న కాలనీలో త్రాగు నీటి సమస్య తీవ్రంగా వుంది. ఉదయం కొన్ని నిమిషాలపాటే నీటి సరఫరా అవుతుంది. కరెంటు పోతే నీటి సరఫరా వుండదు. దీనిపై ఎన్నిసార్లు విన్నవించుకున్నా సమస్య పరిష్కారం కాలేదు. ఇప్పటికైనా జిల్లా అధికారులు స్పందిస్తే మంచిది.

– సుల్తాన్‌బి



**పారిశుధ్యం, వీధిలైట్ల సమస్య!**

పంచాయితీలో పారిశుధ్యం చాలా అధ్వాన్నంగా వుంది. శివారు ప్రాంతంలో వున్న కాలనీలో వీధిలైట్లు సక్రమంగా వెలగక ఇబ్బంది పడుతున్నాం. వీధులలో వేసిన చెత్తాచెదారాన్ని తొలగించక పోవడంతో దుర్గంధం భరించలేక పోతున్నాం. అలాగే వీధిలైట్లు లేకపోవడంతో రాత్రివేళల్లో దొంగతనాలు జరుగుతున్నాయి.

– మస్తాన్‌బి

గ్రామ పంచాయితీకి పన్నుల రూపంలో ఐదు లక్షల రూపాయలు, 12వ ఆర్థిక సంఘం, ఎస్ఎఫ్‌సి నిధులు కలిపి మరో రెండు లక్షల రూపాయల మేర ప్రతి సంవత్సరం ప్రభుత్వం గ్రాంటు రూపంలో విడుదల చేయడం జరుగుతుంది. ప్రభుత్వం నుంచి గ్రాంటు రూపంలో వచ్చే నిధుల్ని సక్రమంగా వినియోగించలేక పోతున్నారన్న ఆరోపణలున్నాయి.

వింజమూరు గ్రామంలో అంతర్గతరోడ్లు చాలా అధ్వాన్నంగా తయారై వున్నాయి. కేవలం ప్రధాన రహదారిని మాత్రమే సిమెంటు రోడ్డుగా వేశారు. మిగిలిన వీధులు గురించి పట్టించుకునే దిక్కు లేకుండా పోయారు.

పంచాయితీ కార్యాలయం సమీపంలోని బస్టాండు వద్ద చెత్తాచెదారం పేరుకపోయి పాలకవర్గం నిర్లక్ష్యాన్ని ఎత్తి చూపుతుంది. ఈ క్రమంలో పంచాయితీ పరిధిలోని సమస్యలపై స్థానికులు వెల్లడించిన అభిప్రాయాలను ప్రక్కనిస్తున్నాం.



చెత్తా చెదారంతో నిండిన డ్రైనేజి కాలువ.



కాలనీలో రోడ్డు దుస్థితి.

అవినీతి కథ

# నేలటూరులో ఇందిరమ్మ గృహాల నిధుల స్వాహా!

అధికారుల నిర్లక్ష్యం, ప్రజాప్రతినిధుల వుదాసీనవైఖరి కారణంగా ప్రభుత్వ పథకాలు సక్రమంగా అమలుకావడం లేదు. ప్రభుత్వం పథకాల అమలు కోసం ఎన్ని కఠిన నిబంధనలు విధించినా కూడా ఏదో ఒక విధంగా తూట్లుపడుతూనే వున్నాయి. అవినీతి, అక్రమాల కారణంగా ఆశించిన మేర అభివృద్ధి పథకాలు లబ్ధిదారులకు దక్కడం లేదు. సంక్షేమ పథకాలకు సంబంధించిన నిధులు అధికారులు, నేతల జేబుల్లోకి వెళ్తున్నాయి.

జిల్లావ్యాప్తంగా ఇందిరమ్మ గృహ నిర్మాణాల్లో అవినీతి, అక్రమాలు చోటు చేసుకున్నాయి. వీటిని సరిదిద్ది గాడిలో పెట్టాల్సిన గృహనిర్మాణశాఖ అధికారులు రాజకీయ నేతల ఒత్తిళ్లకు లొంగి బాధ్యులపై చట్టపరమైన చర్యలు తీసుకునేందుకు వెనుకంజవేస్తున్నారు. కొన్ని మండలాల్లో సర్పంచ్‌లు కాంట్రాక్టర్ల అవతారమెత్తి ఇందిరమ్మ గృహాలు నిర్మించగా, మరికొన్ని మండలాల్లో గృహనిర్మాణశాఖ అధికారులే కాంట్రాక్టర్లుగా మారి బినామీ పేర్లతో గృహనిర్మాణాలు చేపట్టిన దాఖలాలు లేకపోలేదు. అధికారులు, బినామీ కాంట్రాక్టర్ల కారణంగా లబ్ధిదారులు నష్టపోవాల్సి పరిస్థితి ఏర్పడింది.

ఇందుకు ఉదాహరణగా ముత్తుకూరు మండలంలోని నేలటూరు గ్రామాన్ని పేర్కొనవచ్చు. ఈ మండలంలో పనిచేసి ఇటీవల బదలీ అయినా ముక్తియార్ అనే గృహనిర్మాణశాఖ ఎఇ లక్షలాది రూపాయల నిధుల స్వాహా చేశాడు. నేలటూరు గ్రామానికి చెందిన 12 ఇందిరమ్మ గృహాలకు స్లాబ్ వేయకుండానే వేసినట్లు రికార్డులు తయారుచేసి సొమ్ము దిగమింగాడు. ఇంతేకాకుండా మరో ఆరు పక్కాగృహాలకు బేస్‌మట్టం నిర్మించకుండానే నిర్మించినట్లు రికార్డుల్లో చూపించి ఆ బిల్లులు కూడా లబ్ధిదారులకు చెల్లించకుండానే జేబులో వేసుకున్నాడు.

ఈ అవినీతి, అక్రమాలు చోటుచేసుకుని దాదాపు అయిదు నెలలు కావస్తున్నా ఆ శాఖ అధికారుల్లో ఏమాత్రం స్పందన కానరావడం లేదు. ముత్తుకూరు మండలం నుంచి వెంకటాచలం మండలానికి బదలీపై వెళ్లినప్పటికి గృహనిర్మాణలకు సంబంధించిన ఎం.బుక్‌లు, ఇతర రికార్డులు కొత్తగా వచ్చిన ఎ.ఇకి అప్పగించలేదు. ఎ.ఇ చేసిన అవినీతి, అక్రమాలు ఆ శాఖ డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఇంజినీర్, ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లకు తెలిసినా కూడా బహిర్గతం కాకుండా జాగ్రత్తలు తీసుకున్నారు.

> “ ముత్తుకూరు మండలం నేలటూరు గ్రామంలో ఇందిరమ్మ గృహాలకు స్లాబు వేయకుండానే వేసినట్లు రికార్డులు తయారుచేసి సొమ్ము దిగమింగారు. ”

కాని పక్కా గృహాలు పూర్తి కాకపోవడంతో లబ్ధిదారులు ఈ విషయాన్ని అధికారుల దృష్టికి తీసుకురావడంతో అక్రమాలు వెలుగు చూశాయి. ఎ.ఇ ముక్తియార్ స్వాహా చేసిన నిధులను తిరిగి స్వాధీనం చేసుకోకుండానే నేలటూరు గ్రామంలో నిలిచిపోయిన గృహాలను నిర్మించే విధంగా అధికారులు ఒప్పందం చేసుకున్నట్లు తెలుస్తుంది. అయితే అనుకున్న ప్రకారం గృహాలను ఇప్పటివరకు నిర్మించేందుకు ఎటువంటి చర్యలు చేపట్టలేదు. నిధుల దుర్వినియోగానికి పాల్పడిన వారిపై శాఖాపరంగా చర్యలు తీసుకోవడంతోపాటు, క్రిమినల్ కేసులు కూడా నమోదు చేయాల్సి వుంటుంది.



ఇందిరమ్మ గృహాలు మాత్రం అసంపూర్తి... బిల్లులు మాత్రం పూర్తి.

ఆశాఖ ఉన్నతాధికారుల వైఖరి చూస్తుంటే నిధుల స్వాహాకు పాల్పడి, ఇళ్ల నిర్మాణం పూర్తికాకుండా వుండేందుకు కారకుడైన ఎ.ఇ ముక్తియార్‌ను అన్ని విధాలుగా కాపాడేందుకు ప్రయత్నాలు చేస్తున్నారు. రాష్ట్రప్రభుత్వం ఎంతో ప్రతిష్టాత్మకంగా చేపట్టిన ఇందిరమ్మ గృహనిర్మాణ పథకానికి తూట్లు పొడుస్తున్న ఇటువంటి అధికారులపై జిల్లా కలెక్టర్ చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.



## డిమాండ్ పెరిగిన 'సమంతా'

దీపముండగానే ఇళ్లు చక్క బెట్టుకోవాలన్న విషయాన్ని 'ఏమాయ చెసావె' ఫేం హీరోయిన్ సమంతా బాగా ఫోలో అవుతుంది. సమంతా తనకు లభించిన ఒక్క హిట్‌తో బాగా బిజీ అయిపోయింది. వరుసగా అందరు హీరోలతో నటించడానికి ఆమె గ్రీన్‌సిగ్నల్ ఇచ్చింది. దీంతో 2011 డిసెంబర్ వరకు ఈవిడగారి కాల్షీట్స్ డైరీ ఫుల్లుగా నిండిపోయింది. తెలుగు అగ్రహీరోలు ఈమెను తమ సరసన బుక్ చేయమనడంతో సమంతా తన పారితోషికాన్ని ఒక్కసారిగా 80లక్షలకు పెంచేసింది.



## ● కామసూత్రలో
## అంకిత

లాహిరి లాహిరి చిత్రంతో తెలుగు తెరకు పరిచయమైన నటి అంకిత తెలుగులో పలు చిత్రాల్లో నటించింది. కాని ఈ మధ్య ఆమెకు అవకాశాలు బాగా తగ్గిపోయాయి. దీంతో ఏం చేయాలో తోచని ఈ భామ రీసెంట్‌గా యువకులను కవ్వించే కామసూత్ర యాడ్‌లో నటించను ఒప్పుకొంది. చిన్నప్పుడు రస్నా యాడ్‌తో చిన్న పిల్లలను ఆకర్షించిన ఈ తార కామసూత్ర ప్రకటన ద్వార పెద్దలను ఆకర్షించే ప్రయత్నం చేస్తుంది. ఇప్పటికే అంకిత ఐటమ్ పాటలలో నర్తిస్తుంది. కామసూత్ర ప్రకటన ఈమె కెరీర్‌లో ఎలాంటి మలుపు తీసుకొస్తుందనేది యాడ్ విడుదలైతే గాని తేలదు.

## త్రివిక్రమ్ నత్తనడక

సక్సెస్‌పుల్ దర్శకునిగా తివిక్రమ్ శ్రీనివాస్ పేరు గాంచాడు. ఈ విషయంలో ఎవరికీ ఎటువంటి సందేహం లేదు. ఆయనతో సినిమాలు నిర్మించాలంటే అగ్ర నిర్మాతలు సైతం ఒకటికి రెండుసార్లు ఆలోచించాల్సిన పరిస్థితి. ఎందుకంటే... ఆయన ఒక్కో చిత్రానికి రెండేళ్లు వ్యవధి తీసుకొంటున్నాడు. ఇంకా ఎంతకాలం పడుతుందో ఎవరికీ తెలియదు. స్క్రిప్ట్‌తో పాటు దర్శకత్వం చేపట్టాకనే త్రివిక్రమ్ మితిమీరిన సమయం తీసుకొంటున్నాడని సినీ పరిశ్రమలో అందరూ వాఖ్యానిస్తున్నారు.

## బికినీలో విమలా రామన్



సక్సెస్‌ల మాటెల వున్నా విమలా రామన్ కెరీర్ ఇప్పుడు జోరుగా సాగిపోతుంది. దానికి కారణం ఆమె బికినీ ధరించడమేనంటున్నాయి సినీ పరిశ్రమ వర్గాలు. ఎవరైనా ఎప్పుడైనా చిత్రం అంతగా ఆడకపోవడంతో విమలా రామన్ తరుణ్ సరసన అవకాశమొచ్చిన చుక్కలాంటి అమ్మాయి చక్కనైన అబ్బాయి చిత్రంలో బికినీ వేసుకొంది. ఈ చిత్రం విడుదల కాకపోయినా గాయం-2లో జగపతిబాబు, సేవకుడు చిత్రంలో శ్రీకాంత్ సరసన ఆమెకు నటించే అవకాశమొచ్చింది. మొత్తం మీద మొన్న మొన్నటివరకు తన కెరీర్ ఎలా వుంటుందోనని ఆందోళనపడ్డ విమలా రామన్ బికినీ ద్వారా వచ్చిన వరుస అవకాశాలతో ఎనలేని ఆనందాన్ని అనుభవిస్తుంది.

## తలుపు తట్టని అదృష్టం



విజయవాడ అమ్మాయి విగద్దె సింధూరకు సినిమాలు అంతగా కలసిరాకపోయినా మోడల్‌గా మంచి పేరు తెచ్చుకొంది. చిన్నతనంలోనే బెజవాడ నుంచి న్యూజిల్యాండ్ వెళ్లిన సింధూర అక్కడ కొద్దికాలం మీడియాలో సైతం పని చేసింది. సాహసోపేతమైన క్రీడలు స్కై డైవింగ్, స్నోబోర్డింగ్ వంటి వాటిలో ఆమెకు మంచి ప్రావీణ్యముంది. అయితే ఇన్ని సాహసాలు చేయగలిగిన సింధూర తన పొడుగు కాళ్ల కారణంగానే తెలుగు హీరోలకు అంతగా సెట్‌కాలేదని అందువల్లే సినిమా అవకాశాలు రాలేదని బాధ పడుతుంది.



## మాస్ మసాల 'సింహా'

అల్లూరు రహీం

గత ఐదారేళ్లుగా హిట్ కోసం పరితపిస్తున్న హీరో బాలకృష్ణ కోరిక తీర్చిన చిత్రం యునైటెడ్ మూవీస్ పతాకంపై పరుచూరి కిరిటీ తీసిన సింహా. గతంలో బాలకృష్ణ నటించిన ఫ్యాక్షన్ చిత్రాలు సమరసింహారెడ్డి, నరసింహనాయుడు బాటలో ఈ చిత్రం నడుస్తుంది. ప్రేక్షకులను క్షణక్షణం ఉత్కంఠతకు గురిచేయను వందల శవాల గుట్టలు, తెగిపడిన కాళ్లు చేతులు, ఎగజిమ్మే నెత్తురు, పైకి లేచిపోయే సుమోలతో కూడిన సన్నివేశాలు 'సింహా'లో చాలానే వున్నాయి. వీటికితోడు ముగ్గురు హీరోయిన్లు నమిత, నయనతార, స్నేహాఉల్లాల్‌లు తమ అందచందాలతో మాస్‌ను కట్టిపడేస్తారు. తన సహజధోరణికి భిన్నంగా బాలకృష్ణ సింహాలో కష్టపడి నటించడంతోపాటు వయసును లెక్కచేయకుండా ఫైట్స్, డ్యాన్స్ బాగా చేశాడు. సింహమంటి చిన్నోడే, హారబ్బా, జానకి... జానకి వంటి మసాలా పాటలు, వాటిలో వెండితెర నిండుగా హీరోయిన్ల అందాలు, బాలకృష్ణ పలికే మాస్ డైలాగులు ప్రేక్షకులను అలరిస్తున్నాయి. నవరసాలు వుండాలని కాబోలు ఈ చిత్రంలో సరసాల పాలు కాస్త ఎక్కువగానే పెట్టాడు దర్శకుడు. బాలకృష్ణ వెండితెరపై కనిపించే సమయంలో అరటికాయల మార్కెట్ వద్ద చేసే ఫైట్స్‌లో కొత్తదనం కనిపిస్తుంది. నేను మాట్లాడితే చెవులు మాత్రమే పనిచేయాలి. చూడు ఒకవైపే చూడు... అర నిమిషంలో చచ్చే నీకెందుకురా నా అడ్రస్. పదిమందితోరా... పది పది పెంచుకొంటూరా... కొడితే మెడికల్ ట్రీట్‌మెంట్‌కు మీ ఆస్తులు చాలవంటూ బాలకృష్ణ నోట పలికిన డైలాగులు ఆయన అభిమానులను హుషారెత్తిస్తాయి. ఒకచోట బాలకృష్ణ చరిత్ర అంటే మాది... చరిత్ర రాయాలంటే మేమే... నీదే మిటి బూడిద జాతి అని వివాదాస్పద డైలాగులు చెబుతాడు. మరో చోట విలన్ చేత ఏమిట్రా నీ వంశం జనం కోసం... జనం కోసమని చస్తామనే డైలాగును హీరో స్టామినా పెంచను పలికించారు. సింహా సినిమా లైన్‌అండ్‌లెన్త్ దాటి పోకుండా కథ, మాటలు, స్క్రీన్‌ప్లేతోపాటు దర్శకత్వ బాధ్యతలు నెరిపిన బోయపాటి శ్రీను బాగా శ్రమించాడు. ఆయన శ్రమకు ఫలితం లభించింది.

చిత్ర కథలోనికి వెళ్తే హైదరాబాద్‌లోని ఓ కాలేజిలో శ్రీమన్నారాయణ(బాలకృష్ణ) ప్రొఫెసర్‌గా పనిచేస్తుంటాడు. ఆ కాలేజిలో విద్యార్థులను అవసరమైతే దండిస్తూ క్రమశిక్షణ పాటించేలా చేస్తుంటాడు. ఈ కాలేజిలోనే లెక్చరర్‌గా పనిచేసే మహిమ(నమిత), శ్రీమన్నారాయణ అంటే పడిచస్తుంటుంది. ఇంతలో కాలేజిలో కొత్తగా చేరే స్టూడెంట్ జానకి(స్నేహాఉల్లాల్)కు శ్రీమన్నారాయణ విపరీతంగా నచ్చేస్తాడు. ఆమెను రెండు మూడు ప్రమాదాల నుంచి రక్షించడంతో పాటు తన పొరిగింట్లో వుండే కృష్ణ(అలీ) వాళ్ల దగ్గర పేయింగ్ గెస్ట్‌గా పెడతాడు. జానకిని పెళ్లిచేసుకోవాలని తెగ తిరుగుతుండే గోపి (ఆదిత్యమీనన్) విశాఖపట్నం నుండి హైదరాబాద్‌కు వస్తాడు. గోపి గ్యాంగ్ నుంచి కూతురి ప్రాణాలు కాపాడను జానకి తండ్రి రఘు కూడా హైదరాబాద్ వస్తాడు. ఈ సందర్భంగా జరిగే ఘర్షణలో శ్రీమన్నారాయణ బామ్మ(కె.ఆర్.విజయ) గాయపడుతుంది. ఈ సందర్భంగా ఆమె శ్రీమన్నారాయణ కుటుంబ గాధను వివరిస్తుంది. బొబ్బిలిరాజ వంశీయుడైన డాక్టర్ నరసింహ(బాలకృష్ణ) లండన్‌లో ఎఫ్ఆర్‌సిఎస్ పూర్తిచేసి స్వంత ప్రాంతంలోనే పేదలకు వైద్యం చేస్తుంటాడు. ఈ ప్రాంతంలోనే వుండే వీరకేశవుడు(మళయాళ సాయికుమార్) చేసే అన్యాయాలు, అక్రమాలకు అంతుండదు. వీరిని డాక్టర్ నరసింహ



ఎదుర్కొంటాడు. వీరకేశవుని ఇద్దరు సోదరులను చంపేస్తాడు. దీంతో ఉగ్రుడైన వీరకేశవుడు ఒక పథకం ప్రకారం డాక్టర్ నరసింహను, ఆయన భార్య గాయత్రి (నయనతార)ను చంపేస్తాడు. ఈ సందర్భంగా డాక్టర్ నరసింహ కొట్టే దెబ్బకు వీరకేశవుడు కోమాలోకి వెళ్తాడు. మళ్లీ ఆయన కుమారుడు శ్రీమన్నారాయణ కొట్టే దెబ్బతో కోమాలో నుంచి బయటకు వస్తాడు. కథంతా విన్న శ్రీమన్నారాయణ లక్ష్మీనరసింహ అవతారమెత్తి తన కుటుంబాన్ని అంతమొందించిన శత్రుమూకలన్నింటినీ మట్టి కరిపించి జానకిని తనదాన్ని చేసుకోవడంతో చిత్రం ముగుస్తుంది.

చిత్రంలో దుష్టగణంగా కోట శ్రీనివాసరావు, మళయాళ సాయి కుమార్, ఆదిత్య మీనన్ రాణించారు. నమిత సింహాలో ప్రత్యేక ఆకర్షణే. నయనతార రాజ కుటుంబీకురాలిగా బాగుంది. పాపం వీరిద్దరి మధ్య స్నేహఉల్లాల్ పాలిపోయింది. సింహా చిత్రం విజయం తాలుకు క్రెడిట్ చెరి సగం హీరో బాలకృష్ణ, దర్శకుడు బోయపాటి శ్రీనుదని చెప్పకతప్పదు.

# మారని జనం

## మళ్లీ కుచ్చు టోపి పెట్టిన మనీ సర్క్యులేషన్ స్కీం



బోర్డులు తిప్పేస్తున్న మనీ సర్క్యులేషన్ స్కీములు. (ఫైల్‌ఫోటో)

ఎన్నిసార్లు దగాపడినా, మరెన్నో సార్లు నిండా మునిగినా చైన్‌లింక్ స్కీమ్‌లు, మనీ సర్క్యులేషన్‌లో చేరి నష్టపోతూనే వున్నారు ప్రజలు. చిన్న చిన్న మొత్తాలు పెట్టుబడి పెడితే స్వల్పకాలంలో అధిక మొత్తాలు పొందవచ్చని, ఐదుగురు సభ్యులను చేరిస్తే నెలనెలా ఆదాయం గడించవచ్చని ఆశపెడుతూ తీయని మాటలతో పేద ప్రజలను దోచుకొంటూనే వున్నారు. గతంలో గ్రీన్ గ్లోరీ బారినపడి పలువురు ఆర్థికంగా నష్టపోయిన సంగతి తెలిసిందే. పోలీస్ పెద్దల పాత్ర ఈ చైన్‌లింక్ స్కీంలో వుండడం అప్పట్లో గగ్గోలు రేగింది. ఆతర్వాత పలు సంస్థలు బోర్డు తిప్పి డబ్బుకట్టిన వారినెత్తిన కుచ్చుటోపీ పెట్టాయి. తాజాగా ట్రస్టు ఫర్ హ్యూమన్ వెల్ఫేర్ పేరుతో నిలువునా మోసగించిన సంస్థ బండారం బట్టబయలైంది. నెలనెలా కొంత మొత్తం తమ సంస్థలో కడితే రుణాలిస్తామంటూ పలువురిని దగా చేయడంతో కుటుంబాలకు తోడ్పాటుగా వుంటుందని, రుణం లభిస్తుందని ఆశపడి డబ్బు చెల్లించిన పలువురు లబోదిబోమంటూ పోలీసులను ఆశ్రయిస్తున్నారు.

# కొబ్బరినీళ్లు అమృతతుల్యం!

ఎండాకాలంలో శరీరానికి ఎంతో మేలు చేసేవి కొబ్బరినీళ్లు. టెంకాయలు ఆ కాలం, ఈ కాలం అనే తేడా లేకుండా ఏడాది పొడవునా దొరుకుతాయి. మిగతా కాలాల్తో పోలిస్తే వేసవిలో వీటికి భలే డిమాండ్. కాస్త తియ్యగా, ఒకింత ఉప్పగా, కొంచెం వగరుగా వుండే లేత టెంకాయనీళ్లు అద్భుతమైన పానీయం. దప్పికను, అలసటను చిటికెలో మాయం చేసి ఉత్తేజాన్ని కల్గించే పోషక పానీయం కొబ్బరినీళ్లు. ఏకైక సురక్షిత సహజ శీతల పానీయంగా టెంకాయ నీళ్లను అభివర్ణిస్తారు.

ప్రతి ఇంటిలో టెంకాయ చెట్టు వుంటుంది. చెట్టులోని ప్రతిభాగమూ ఉపయోగపడేది కాబట్టి దీనిని కల్పవృక్షం అంటారు. సంస్కృతి సాంప్రదాయాలకు, యజ్ఞయాగాదులకు టెంకాయకు ఎంతో ప్రాధాన్యత ఉంది. వేసవితాపం నుంచి సేదతీరేందుకు ఉపయోగపడడంతోపాటు జీర్ణక్రియకు సంబంధించిన సమస్యలు, వాంతులు విరోచనాలకు, జ్వరం తదితర అనారోగ్య సమస్యలకు టెంకాయ నీళ్లు దివ్య ఔషధం. కొబ్బరి నీళ్లతో ముఖాన్ని కడుక్కొన్నట్లయితే మొటిమలు, మచ్చలు తొలగి కాంతివంతం అవుతుందని ఆయుర్వేద వైద్యులు చెప్తున్నారు.


వేసవి తాపమే కాదు వంటికి కూడా మంచివి కొబ్బరినీళ్లు.

పిండి పదార్థాలు, ఖనిజాలు, ఫాస్ఫరేట్, విటమిన్ ఎ, బి, సిలు పుష్కలంగా వుండే టెంకాయ నీళ్లు సహజ సెలైన్. వెంటనే రక్తంలో కలిసి ప్లాస్మాలా పనిచేస్తాయి. లేత కొబ్బరి నీళ్లలో శక్తి 17.4%, నీరు 95.5%, కార్బోహైడ్రేట్లు 4.4%, ప్రొటీన్లు 0.01%, కొవ్వు 0.01%, పొటాషియం 290 మిల్లీ గ్రాములు, సోడియం 42 మిల్లీ గ్రాములు, మెగ్నీషియం 10 మిల్లీ గ్రాములు వుండే టెంకాయనీరు నిజంగా భూలోకపు అమృతమే.

# జాతీయ అవార్డు లక్ష్యం


మనసులో మాట చెప్పిన చంద్రబోస్.

తాను వ్రాసిన తెలుగు పాటకు జాతీయ అవార్డు సాధించాలన్నదే లక్ష్యమని ప్రముఖ సినీ పాటల రచయిత చంద్రబోస్ స్పష్టం చేశారు. బుచ్చిలో జరుగుతున్న కళాసాగర్ నాటక పోటీలకు ముఖ్య అతిథిగా విచ్చేసిన ఆయన నెల్లూరు నగరంలో బస చేశారు. ఈ సందర్భంగా పలు అంశాలపై మాట్లాడారు. తాజ్‌మహల్ సినిమాతో సినీ రంగ ప్రవేశం చేశాను. అందులో మంచు కొండల్లోన చంద్రమా... అన్నది నా మొట్ట మొదటి పాట. ఆ పాట ఎంతో పాపులరై నా సినీజీవితాన్ని సుస్థిరం చేసింది. డి.రామానాయుడు, దర్శకుడు ముప్పలనేని శివ నాకు ఈ అవకాశం అందిస్తే దర్శకేంద్రుడు రాఘవేంద్రరావు నన్ను వెన్నుతట్టి ప్రోత్సహించారు. ఇప్పటికి 750 సినిమాల్లో 2600కు పైగా పాటలు వ్రాసినా నా ఆటోగ్రాఫ్ సినిమాలో మౌనంగా ఎదగమని, స్టూడెంట్ నెం-1లో ఎక్కడో పుట్టి ఎక్కడో పెరిగి తదితర పాటలంటే ఇష్టం అన్నారు.

ఎందరో సినీ దిగ్గజాలకు జన్మనిచ్చిన నెల్లూరు అంటే ఎంతో అభిమానం, గౌరవం. సింహపురి సీమను దర్శనీయ స్థలంగా భావిస్తాను. ఇక నెల్లూరు భోజనం, అందులోను చేపల పులుసు గురించి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదని వ్యాఖ్యానించిన చంద్రబోస్ తాను పాటలు వ్రాసి విజయవంతంగా ప్రదర్శిస్తున్న సింహా చిత్రం విజయం తాలుకు ఆనందాన్ని ఆస్వాదిస్తున్నట్లు తెలిపారు.

# జోరుగా కల్లు వ్యాపారం!

వేసవి తీవ్రంగా వుండడంతో సహజంగానే కల్లు వ్యాపారం జోరందుకొంటుంది. పలు ప్రాంతాల్లో రోడ్డు వెంట కల్లు కుండలను పెట్టుకొని వ్యాపారం నిర్వహించేవారు కన్పిస్తారు. ఎండలు మండి పోతుండడంతో పలువురు కల్లును సేవించేందుకు ఇష్టపడతారు. సహజసిద్ధంగా లభించే కల్లు త్రాగడం వల్లన వేసవి తాపం నుంచి బయటపడవచ్చుననేది కల్లు ప్రియుల అభిప్రాయం. అధిక ధర పెట్టి బీర్లు, ఇతర మద్యాన్ని కొన్ని త్రాగలేని వారు, కార్మికులు, చిన్న వ్యాపారులు, రిక్షావాళ్లు ఈ కల్లును సేవించేందుకు మొగ్గుచూపుతారు. ఎండాకాలంలో కల్లుకు వున్న డిమాండ్ అంతా ఇంతా కాదు. ఒక్కో చెట్టుకు రోజుకు మూడు నుంచి నాలుగు లీటర్ల కల్లు మాత్రమే వస్తుంది. అవసరాలకు సరిపడా ఉత్పత్తి వుండకపోవడంతో కల్లు వ్యాపారులు కల్తీకి దిగుతున్నారు. చెట్టు నుంచి తీసిన కల్లుకు అంతే మోతాదులో పులిసిన మజ్జిగ, నీరుతోపాటు మత్తుకోసం డైజోఫామ్ మాత్రలు కలుపుతుండడంతో ఈ కల్తీ కల్లు సేవించిన వారు అనారోగ్యం పాలవుతున్నారు.


కల్లు కుండల్లో నుంచి బిందెల్లోకి మారిన వ్యాపారం.

విరోచనాలు, వాంతులు కావడంతోపాటు కొన్ని సమయాల్లో ప్రాణాల మీదకు తెచ్చుకొంటున్నారు. ముత్తుకూరు రోడ్డు, నవలాకులతోట, అల్లీపురం, నరసింహకొండ రోడ్డు, తదితర రూరల్ ప్రాంతాల్లో ఈ కల్తీ కల్లు వ్యాపారం ఎక్కువగా సాగుతుంది.

# బ్రాహ్మణులకు అండదండగా వుంటాం!

నెల్లూరు నగరంలోని టివిఎస్ కళ్యాణ్‌సదన్‌లో బ్రాహ్మణులకు సంబంధించి పార్థివ శరీర వసతి భవనం ప్రారంభోత్సవం, అకాల మృత్యు మోక్ష స్థూపం ఆవిష్కరణ కార్యక్రమం మే 9వ తేది జరిగాయి. రూరల్, నగర శాసనసభ్యుల ద్వయం వివేకానందరెడ్డి, శ్రీధర్ కృష్ణారెడ్డిలు అతిథులుగా విచ్చేశారు. వీరు మాట్లాడుతూ పేద బ్రాహ్మణులను ఆదుకొనేందుకు తమ వంతు సహకారం అందిస్తామన్నారు. ట్రస్ట్ అధ్యక్షుడు డాక్టర్ అజయ్‌కుమార్ మాట్లాడుతూ పేద బ్రాహ్మణుల సంక్షేమం కోసం చేపడుతున్న కార్యక్రమాలను వివరించారు. ఈ సందర్భంగా 190 మంది పేద బ్రాహ్మణ విద్యార్థులకు మూడు లక్షల రూపాయల స్కాలర్‌షిప్పులు, వికలాంగులకు ట్రై సైకిళ్లు అందజేశారు. ఈ కార్యక్రమంలో మేయర్ భానుశ్రీ, బ్రాహ్మణ సంఘ నాయకులు చంద్రమౌళి, డాక్టర్ పిఎస్ఆర్‌కె మూర్తి, రాళ్లపల్లి రామసుబ్బారావు తదితరులు పాల్గొన్నారు.


టివిఎస్ కళ్యాణ్‌సదన్‌లో బ్రాహ్మణ పార్థివ శరీర వసతి భవనాన్ని ప్రారంభిస్తున్న సిటీ ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి. ప్రక్కన డాక్టర్ అజయ్‌కుమార్, డాక్టర్ పిఎస్ఆర్‌కె మూర్తి.


నెల్లూరులోని జైన్‌గోల్డ్ షోరూంలో వారం వారం నిర్వహిస్తున్న లక్కీడ్రా తీస్తున్న కార్పొరేటర్ పుట్టా రామకృష్ణారెడ్డి, ప్రక్కన షోరూం ఛైర్మన్ మణిలాల్ జైన్.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

వరంలో పవర్ ప్లాంట్‌లో పనిచేసే మస్తాన్ తన సెల్‌ఫోన్ చార్జింగ్ చేసి ప్యాంటు జేబులో పెట్టుకొని వెళ్తుండగా అకస్మాత్తుగా అది పేలడంతో తొడలు, పొత్తికడుపు దెబ్బతిని ప్రమాదానికి గురయ్యాడు. ఎండాకాలంలో వేడి తీవ్రతకు ఇలా సెల్‌ఫోన్లు పేలుతుండడంతో వినియోగదారులు భయభ్రాంతులకు గురౌతున్నారు.

### కంభం వేస్ట్

మాజీ మంత్రి మాదాల జానకిరాం వివాదాస్పద వ్యాఖ్యలు చేశారు. ఉదయగిరి మాజీ శాసనసభ్యుడు కంభం విజయరామిరెడ్డి సరైన నాయకుడు కాదని, అందుకే గత ఎన్నికలలో ఓటమి చెందాడని వ్యాఖ్యానించాడు. ఉదయగిరి టిడిపికి నాయకత్వ సమస్య ఏర్పడిందని, క్రొత్త వ్యక్తి వస్తేనే ఇక్కడ పార్టీ చక్కబడుతుందని కార్యకర్తల సమావేశంలో చెప్పడంతో ఆశ్చర్యపోవడం వారి వంతయ్యింది. బొల్లినేని రామారావు అనే పారిశ్రామికవేత్తను ఉదయగిరి తెలుగు నేతను చేయాలని జానకిరాం తలపోస్తున్నారు.

### దేవుడు చెప్పాడట!

నెల్లూరు రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డితో దేవుడు మాట్లాడుతున్నాడట. ఈ విషయాన్ని ఆయనే స్వయంగా చెప్పాడు. దేవాలయాల పాలక మండళ్లలో ఎవరిని నియమించాలనేది ఆ దేవుడే స్వయంగా తనకు తెలియజేస్తున్నాడని వివేకా చెప్పడంతో నగర వాసులు ఆశ్చర్యపోక తప్పలేదు. దేవుడే తనతో మాట్లాడుతున్నాడని ఆయన చెప్పుకోవడం చూస్తుంటే వివేకా మానసిక స్థితిని శంకించాల్సి వస్తోంది.

### సింహా టిక్కెట్లపై వివరణ

గతవారం 'జమీన్‌రైతు' ట్రంకురోడ్డు కబుర్ల శీర్షికలో సింహా సినిమా టిక్కెట్లను రమేష్‌రెడ్డి బ్లాక్ చేశారని వ్రాసిన వార్తకు కోటంరెడ్డి శ్రీనివాసులు రెడ్డి వివరణ పంపారు. రమేష్‌రెడ్డి ఎప్పుడూ బ్లాక్‌లో టిక్కెట్లను అమ్మలేదని, సింహా టిక్కెట్లను కొని అభిమానులకు, తెలుగుదేశం పార్టీ కార్యకర్తలకు యిచ్చారని స్పష్టం చేశారు.

## జనవాణి

2వ పేజీ కొరవ

చేద్దాం. ఇంటర్‌లో ఒత్తిడి వుందదా? ఇంటర్ మార్కులు ఎంసెట్‌లో పరిగణిస్తున్నప్పుడు పది వరకు పరీక్ష లేకుండా వచ్చిన విద్యార్థికి ఎంసెట్‌లో మంచి ర్యాంక్ ఎలా వస్తుంది. ఒత్తిడి అని ఇంటర్ పరీక్షలు లేకుండా చేసి ఇంజనీరింగ్, మెడిసిన్ సీట్లు ఇచ్చేస్తారా?

*టి.స్వయంప్రభ, నెల్లూరు*

### మోనా గొప్ప భావుకుడు!

కవి మోనా నాకు 1976 నుండి పరిచయస్తుడు. ఇందిరాగాంధీ 20 సూత్రాల పథకం ప్రచారం విస్తృతంగా సాగుతున్న రోజులవి. తోలుబొమ్మలాట కళాకారుల ప్రదర్శనార్థం మోనా రాసిన వీధి రూపకాన్ని సమాచారశాఖ అప్పట్లో ఎంపిక చేసి ఆంధ్రప్రదేశ్ పత్రికలో ప్రచురించడం ఆయన ప్రతిభకో తార్కాణం. జాతీయ ఉత్సవాలు, సాహిత్య సభలు, సమావేశాల్లో ఆ రోజుల్లో నెల్లూరు నగరం తడిసి మోపెడౌతుండేది. మోనా గళం విన్పించని కవితా గోష్ఠులు అరుదుగా వుండేవి. నది కావ్యం మోనాకు సాహిత్యలోకంలో గొప్ప గుర్తింపు నిచ్చింది. మోనా కవీంద్రుడు అనే తుళ్లింత ఆనాడు చర్చనీయాంశమైంది. 'జమీన్‌రైతు'లో దానిపై మాట కచ్చేరి కూడా జరిగింది. ఒకవైపు తెలుగుభాషా యోషకు పురాతన 'పట్టా' చేతికిచ్చి మరోవైపు మాతృభాషకు గోతులు తీస్తున్న నేటి అజ్ఞానాంధ కారంలో మోనాలాంటి తెలుగు వెలుగులు మనకు కరదీపికలు. సంస్మరణీయులు.

*ఎం.రామమూర్తి, విశాఖపట్నం*



# ఇసుక అక్రమ త్రవ్వకంపై సుప్రీంకోర్టుకు వెళ్లిన కాకాణి!

చందమామ కథలోని పట్టువదలని విక్రమార్కుడి పాత్ర మన జిప ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డిలో పరకాయ ప్రవేశం చేసినట్లుంది. ఇసుక అక్రమాల నిరోధానికి ఆయన చేస్తున్న పోరాటం చూస్తుంటే కథలోని పట్టువదలని విక్రమార్కుడి పట్టుదల కూడా పనికిరాదేమో ననిపిస్తున్నది. పెన్నానది ఇసుక త్రవ్వకం మాఫియా తరహా వ్యాపారం. మద్రాసులో ఇసుక త్రవ్వకాల నిషేధం, కృష్ణపట్నం పోర్టు ప్రాంతాలలో పరిశ్రమల నిర్మాణం వల్ల పెన్నా ఇసుకకు ఎక్కడలేని గిరాకీ ఏర్పడింది. బంగారుతో పోటీ పడి ధర పలుకుతున్నది. ఒక్క లారీ ఇసుక మద్రాసుకు తరలిస్తే యాభై వేల రూపాయల వరకు లాభం వస్తుందట. అదే మాల్దీవుల వంటి విదేశాలకు ఎగుమతి చేయగలిగితే ఒక్కొక్క లారీకి రెండు లక్షల వరకు లాభం. అంతంత డబ్బు కళ్ల ముందు మెరుపులు మెరిపిస్తుంటే ఎవరు మాత్రం పూరకుండగలరు చెప్పండి. ఈ మాఫియాకు ఆనం సోదరుల అండ, ఆశ్రయం వున్నాయి. అందుకు ప్రతిగా వారి వాటాలు వారికి దక్కుతున్నాయి. ఆ సోదరులలో ఇద్దరు నేరుగా ఆ వ్యాపారంలో భాగస్వాములు. పైనున్న ఇద్దరికీ రౌడీ మామూళ్లు. వారి ప్రమేయం వుందన్న నిజం తెలియడంతో అధికారులెవరూ ఇసుక గనుల జోలికి, లారీల దగ్గరకు వెళ్లరు. ఈ అండ చూసుకొని ఇసుక వ్యాపారులు ప్రభుత్వానికి చిల్లి గవ్వ చెల్లించకుండా ఏళ్లతరబడి కాసులు రాసులు పోసుకొంటున్నారు. అన్ని చట్టాలను ధిక్కరిస్తున్నారు.

ఈ మాఫియా సామ్రాజ్యాన్ని చిన్నాభిన్నం చేయడానికి కంకణం కట్టుకొన్నాడు గోవర్ధన్‌రెడ్డి. ముందుగా మైనింగ్ అధికారుల మీద కన్నెర్ర చేసి, వారు మాట వినకపోయేసరికి కోర్టు వరకు వెళ్లి వ్యాపారుల ముక్కు పిండి వేలం పాటల డబ్బు కక్కించాడు. దానివల్ల జిప సంస్థకు ఈ ఏడాది 26కోట్ల వరకు రాబడి వచ్చింది.

మరోప్రక్క ఇసుక త్రవ్వకంలో పొక్లయిన్ వంటి యంత్రాలు వాడకూడదన్న నియమాన్ని పాటింప చేయడానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. విజిలెన్స్ శాఖను రంగంలోకి దించాడు. మొదట మొదట విజిలెన్స్ అధికారులు కఠినంగానే వ్యవహరించారు. అయితే ఆనం రామనారాయణరెడ్డికి, విజిలెన్స్ డిజిపి దినేష్‌గారికి దగ్గరి చుట్టరికం. ఆ చనువుతో మంత్రి విజిలెన్స్ అధికారుల మీద ఒత్తిడి తెచ్చి, వారు ఇసుక త్రవ్వే ప్రాంతాలకు వెళ్లకుండా నిలిపివేశాడు. దీని మీద కూడా కాకాణి గోవర్ధన్‌రెడ్డి హైకోర్టులో న్యాయపోరాటం చేశాడు. కోర్టు అనుకూల తీర్పులు ఇచ్చింది. అయినాసరే జిల్లా అధికారులు, విజిలెన్స్ సిబ్బంది మంత్రి మాటకు కోర్టు ఉత్తర్వులకు విలువ ఇవ్వలేదు. విసిగిపోయిన జిప ఛైర్మన్ నేరుగా సుప్రీంకోర్టుకు వెళ్లాడు. సర్వోన్నత న్యాయస్థానం హైకోర్టు తీర్పులను లెక్క చెయ్యని జిల్లా అధికారుల మీద మండిపడింది. తక్షణం ఇసుక త్రవ్వకాల దగ్గర సాయుధ బలగాలను రక్షణగా పెట్టాలని ఆదేశించడంతో పాటు, హైకోర్టు ఉత్తర్వులను ఖాతరు చేయని అధికారుల మీద కోర్టు ధిక్కారణ నేరం క్రింద విచారణ జరపాలని నిర్ణయించింది. సుప్రీం కోర్టు ఈ విషయాన్ని పరిగణించిన తీవ్రత చూసి అధికారుల వెన్నులో చలి పుడుతున్నది. కానీ మంత్రి ఆనం రామనారాయణరెడ్డి మాత్రం నెల నెలా తనకు, తన కుటుంబానికి అందుతున్న లక్షలాది రూపాయల మామూళ్లను వదులుకోలేక ఏదో ఒక రూపంలో సుప్రీంకోర్టు తీర్పును కూడా పక్కనపెట్టి, ఇసుక స్మగ్లింగ్ అనుమతించాలని అధికారుల మీద ఒత్తిడి తెస్తున్నారు. తన సర్వీసు మొత్తం నిజాయితీపరుడిగా, ఎవరి మొగమాటాలకు లొంగని కఠినమైన అధికారిగా, ఏ ప్రలోభాలకు పాల్పడని ఉత్తమ వ్యక్తిగా పేరు తెచ్చుకొన్న విజిలెన్స్ డిజిపి దినేష్‌రెడ్డి గారు సంకటంలో పడిపోయి వున్నారిప్పుడు. ఆనం వారంటే ఆయనకు అభిమానం. అట్లని వారి అక్రమ వ్యాపారాలను, దోపిడీలను సహిస్తే తన సర్వీసు చరిత్ర మసి బారుతుంది. సుప్రీం కోర్టు తీర్పు తర్వాత అయినా ఆయన ఈ సందిగ్ధం మాని, కఠినమైన నిర్ణయాలు తీసుకొంటే, జిప ఛైర్మన్ జరుపుతున్న ప్రజాప్రయోజన ఉద్యమం సార్థకత సాధిస్తుంది. పెన్నా ఇసుక త్రవ్వకాల వల్ల రైతులకు జరిగే నష్టం నివారణ అవుతుంది.

### పట్టువదలని విక్రమార్కుడిని మించి పోరాటం చేస్తున్నాడు



## అడకత్తెరలో

మొదటి పేజీ కొరవ

మానం. రెండు రాష్ట్రాలు ఏర్పడితే తెలుగుదేశం పార్టీ జాతీయపార్టీగా గుర్తింపు పొందుతుంది. చంద్రబాబు ఢిల్లీ రాజకీయాలలో ములాయం, లల్లూప్రసాద్‌యాదవ్, మమతా బెనర్జీ, శరద్‌పవార్ వంటి వారితో సమానంగా చలామణి అయ్యే అవకాశం ఏర్పడుతుంది. తెలంగాణ ఏర్పడితే బాలకృష్ణను ఆంధ్ర ప్రాంతం పార్టీ అధ్యక్షుడిని చేసి సంతృప్తి పరచాలన్న ఆలోచన కూడా వుందట. తాను జాతీయ అధ్యక్షుడిగా మెలగవచ్చు. అయితే తెలంగాణ ఏర్పడితే తమ ప్రాంతంలో తెలుగుదేశం పార్టీ బాగా నష్టపోతుందన్నది కోస్తా జిల్లా నేతల ఆవేదన. అది వారికి ఎంత మాత్రం ఇష్టం లేదు.

మొత్తం మీద తన వ్యూహాలు, పథకాలు బెడిసికొట్టి, సమస్యలు మెడకు చుట్టుకొని, అడకత్తెరలో పోక చెక్క వలె నలిగిపోతున్నాడు చంద్రబాబు.

# భూమి కోసం వికలాంగుల నిరాహారదీక్ష!

జిల్లా వ్యాప్తంగా వున్న ప్రభుత్వ భూముల్ని అర్హులైన వికలాంగులందరికీ పంపిణీ చేయాలని చాలా రోజుల నుంచి వికలాంగుల హక్కుల పోరాట సమితి ఆధ్వర్యంలో ఆందోళనలు కొనసాగుతున్నాయి. గతంలో భూపంపిణీ కార్యక్రమం చేపడితే తప్పనిసరిగా వికలాంగులకు పంపిణీ చేస్తామని అధికారులు ప్రకటనలు చేసి వున్నారు. కాని చెప్పిన విధంగా అధికారులు అయిదవ విడత భూపంపిణీలో వికలాంగులకు ప్రాధాన్యత ఇవ్వలేకపోయారు.

అధికారులు మాట తప్పడంతో వికలాంగులు జిల్లా మంత్రిని కూడా కలసి తమ గోడును వెళ్లబోసుకున్నారు. పుట్టుకతోనే అంగవైకల్యం సోకడంతో జీవనాధారం కష్టతరంగా మారి ప్రభుత్వ సహాయం కోసం ఎంతో ఆశతో వీరు


కలక్టరేట్ వద్ద నిరాహారదీక్ష చేస్తున్న వికలాంగులు.

ఎదురు చూస్తున్నారు. మంత్రులు, ప్రభుత్వం స్పందించకపోవడంతో చివరకు నిరాహారదీక్షలకు పూనుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. వికలాంగులకు భూములను పంపిణీ స్పష్టమైన హామీ లభించే వరకు దీక్షలు కొనసాగించాలని నిర్ణయించుకున్నారు.

12వ తేది నుంచి జిల్లా కలెక్టరేట్ ఎదుట నిరాహార దీక్షలు చేపట్టారు. వికలాంగులు చేపట్టిన దీక్షలకు పలు ప్రజాసంఘాలు, పార్టీల నాయకులు మద్దతు ప్రకటించారు. ప్రభుత్వం అందజేస్తున్న పెన్షన్‌తోపాటు భూమి కూడా పంపిణీ చేస్తే కుటుంబాలను పోషించుకునేందుకు వీలవుతుందని పలువురు అభిప్రాయపడ్డారు. ఈ క్రమంలో దీక్షాశిబిరంలో పాల్గొన్న వికలాంగుల హక్కుల పోరాట సమితి నాయకులు వెల్లడించిన అభిప్రాయాలను దిగువనిస్తున్నాం.

### ప్రభుత్వం స్పందించాలి



విధి వంచితులైన వికలాంగుల సంక్షేమం కోసం ప్రభుత్వమే అన్ని విధాలుగా సహాయ సహకారం అందించాలి. జిల్లాలో ప్రభుత్వ భూముల్ని బడుగు, బలహీన వర్గాల ప్రజలతోపాటు వికలాంగులకు కూడా పంపిణీ చేసేందుకు ప్రభుత్వం వెంటనే చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.

- ఎ.నాగేంద్ర.

### అధికారులు మాటతప్పారు



అయిదవ విడత భూపంపిణీలో వికలాంగులకు ప్రాధాన్యతనిస్తామని ముందుగా అధికారులు హామీ ఇచ్చారు. వాస్తవ రూపంలోకి వచ్చేసరికి అధికారులు మాట తప్పారు. వికలాంగుల పట్ల ప్రభుత్వం చిన్న చూపు చూడకుండా జీవనాధారం చూపించేందుకు వికలాంగులకు భూపంపిణీ చేసి ఆదుకోవాలి.

- రమేష్‌నాయుడు.

### ఆందోళన కొనసాగిస్తాం



జిల్లాలోని వికలాంగులందరికీ ప్రభుత్వ భూములు పంపిణీ చేసే వరకు వివిధ రూపాల్లో ఆందోళన కార్యక్రమాలు కొనసాగిస్తాం. పలు ప్రజా సంఘాలు కూడా మాకు మద్దతు ప్రకటిస్తున్నాయి. వికలాంగుల పట్ల అధికారులు చులకన భావంతో వ్యవహరించకుండా సంక్షేమం కోసం కృషి చేయాల్సిన అవసరం వుంది.

- రమణయ్య.

---

# ఎసి సెంటర్‌ను తాకిన రాజీవ్‌భవన్ శిక్షణా తరగతుల సెగ!

నెల్లూరు కాంగ్రెస్ పార్టీని బలోపేతం చేసేందుకు, కార్యకర్తలను పటిష్ట పరచేందుకు రాజీవ్‌భవన్ చర్యలు చేపట్టింది. దీనికిగాను నగరంలోని అన్ని డివిజన్లలో కార్యకర్తలను సంఘటిత పరచి వారికి వివిధ అంశాలపై శిక్షణ నిచ్చేందుకు నడుంబిగించింది. రాజీవ్‌భవన్ నిర్వాహకులు డాక్టర్ అనిల్‌కుమార్ యాదవ్, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, వైవిరామిరెడ్డి తదితరులు క్యాడర్‌ను బలోపేతంచేసే పనిలో నిమగ్నులయ్యారు. వీరికి జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి, సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి తమవంతు సహాయ సహకారాలు అందిస్తుండడంతో రాజీవ్‌భవన్ ప్రజలకు దగ్గరవుతోంది.

మొన్నటి అసెంబ్లీ ఎన్నికల్లో స్వల్ప ఓట్ల తేడాతో ఓటమి చెందినప్పటికీ డాక్టర్ అనిల్‌కుమార్ యాదవ్ రెట్టించిన ఉత్సాహంతో ప్రజలకు సేవ చేసేందుకు ముందుకు వచ్చారు. ప్రజాసేవకు గెలుపు ఓటములతో సంబంధంలేని సేవచేయాలన్న ఆలోచన వుండాలే కాని పదవులు అవసరం లేదని నిరూపిస్తున్నారు రాజీవ్‌భవన్ నేతలు. నగర కాంగ్రెస్ పార్టీని ఆనం సోదరుల కబంధ హస్తాల నుంచి విడిపించి నిజమైన కార్యకర్తలకు న్యాయం చేసేందుకు, జెండా మోసిన వారిని వెన్నుతట్టి ప్రోత్సహించేందుకు వీరు చేపట్టిన, చేపడుతున్న కార్యక్రమాలే నిదర్శనం.


రాజీవ్‌భవన్ శిక్షణా తరగతుల్లో ప్రసంగిస్తున్న జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి. ప్రక్కన డాక్టర్ అనిల్‌కుమార్, వై.వి.రామిరెడ్డి, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి.

మునిసిపల్ కార్పొరేషన్ పాలకులు, అధికారులు ప్రజల సమస్యలు పట్టించుకోకపోవడంతో ప్రజలు పడుతున్న బాధలు గుర్తించి దోమల నివారణకు సొంత నిధులు వెచ్చించి ఫాగింగ్ మిషన్ కొనుగోలు చేసి అన్ని డివిజన్లలో తిప్పారు. ఎండాకాలంలో ప్రజల దాహార్తిని తీర్చేందుకు సైతం సొంత డబ్బులతో వాటర్ ట్యాంకర్‌ను కొనుగోలుచేసి నగర వాసులకు మంచినీటిని సరఫరా చేస్తోంది రాజీవ్‌భవన్. ప్రజా సమస్యలను పరిష్కరించేందుకు ఎప్పటికప్పుడు ముందుండడంతోపాటు కాంగ్రెస్ పార్టీని ప్రజల్లో పటిష్ట పరిచేందుకు, కార్పొరేషన్ ఎన్నికలకు కార్యకర్తలను సంసిద్ధులను చేసేందుకు శిక్షణా తరగతులను ప్రారంభించారు. మొదటి విడతగా ఎస్‌బిఎస్ కళ్యాణ మండపంలో జరిగిన శిక్షణా తరగతులు, రెండవ విడత ఇందిరాభవన్‌లో ప్రారంభమయ్యాయి. రోజురోజుకు రాజీవ్‌భవన్ కాంగ్రెస్ కార్యకర్తలకు, ప్రజలకు దగ్గరవుతుందనేందుకు పలువురు ఆనం వర్గాన్ని వీడి రాజీవ్‌భవన్ చెంతకు చేరుతుండడమే నిదర్శనం. 21వ డివిజన్ కార్పొరేటర్ రజని ఆనం వారి ఆగడాలు, మేయర్ భానుశ్రీ పెత్తనం భరించలేక రాజీవ్‌భవన్ గూటికి చేరింది. జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి తదితరులు ఆమెకు సాదర స్వాగతం పలికారు. శిక్షణా తరగతుపై నిర్వాహకుల అభిప్రాయాలు ఈ విధంగా వున్నాయి.

### దోశెలు పోయడం కాదు



ప్రజా సమస్యలు పరిష్కరించడం అంటే దోశెలు పోయడం, డప్పు కొట్టడం కాదు. విచిత్ర వేషాలు వేయడం అంతకంటే కాదు. నిజంగా అర్హులకు ప్రభుత్వ పథకాలు అందేలా చూడడం, వారి బాధలు, కష్టసుఖాలు తెలుసుకొని సత్వరం సహాయం చేయడం.

- డాక్టర్ అనిల్‌కుమార్.

### నూతన ఒరవడి



రాజీవ్‌భవన్ కార్యకర్తలకు శిక్షణా తరగతులు నిర్వహించడం ద్వారా నూతన ఒరవడికి శ్రీకారం చుట్టింది. పార్టీ శరీరం అయితే కార్యకర్తలు అవయవాల్లాంటి వారు. వారిని చైతన్య పరిచేందుకు కార్యక్రమాలు నిర్వహించడం పవిత్ర ఆశయం. రాజీవ్‌భవన్ నేతలు నిజంగా అభినందనీయులు.

- కాకాణి గోవర్ధన్‌రెడ్డి, జడ్పీఛైర్మన్.

### కుటుంబ పాలన సాగనివ్వం



కాంగ్రెస్ పార్టీ ఎవరి గుత్త సొత్తు కాదు. కష్టపడి పనిచేసే నిజమైన కార్యకర్తలదే పార్టీ. స్వార్థం కోసం పార్టీని అడ్డం పెట్టుకొని వేషాలు వేసేవారి కుటుంబ పాలన సాగనివ్వం. మునిసిపల్ ఎన్నికల్లో కష్టపడి పనిచేసే వారికి టిక్కెట్లు ఇస్తాం తప్ప పిఆర్‌పి, టిడిపి నుంచి వలస వచ్చే వారికి కాదు. వ్యాపారులకు, కాంట్రాక్టర్లకు రాజీవ్‌భవన్‌లో చోటు లేదు.

- కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, పిసిసి కార్యదర్శి.

Regn.No. : RN 1156 / 57
J/Nellore/008/09-11

## కాంగ్రెస్ రాజకీయాలు

8వ పేజీ కొరవ

వికారానందరెడ్డి అని శాపనార్థాలు పెడుతున్నా లెక్క చేయ్యడం లేదు. మంత్రి ఆనం రామనారాయణరెడ్డి మాత్రం ఇటువంటి అల్లరి చిల్లరి చేష్టలకు వెళ్లడు. కానీ ఇప్పుడు ఆయన కూడా అన్న మానాలో నోటి దురుసుకు పాల్పడుతున్నాడు. ఆదాల ప్రభాకర్‌రెడ్డి, కాకాణి గోవర్ధన్‌రెడ్డిల నుద్దేశించి పరుషమైన పదాలతో ప్రసంగాలు చేస్తున్నాడు. పచ్చిగా తిడుతున్నాడు. రాజీవ్‌భవన్ నిర్వాహకులనైతే రౌడీలుగా వర్ణిస్తున్నాడు. దమ్ముంటే మాతో నేరుగా యుద్ధానికి రావాలని, ముసుగులో గుద్దులాట ఎందుకని సవాళ్లు విసురుతున్నాడు.

### పెట్రేగుతున్న పనబాక

ఇదిట్లా వుంటే, కేంద్రమంత్రిణి పనబాక లక్ష్మి పెట్రేగి పోతున్నది. నెల్లూరు నుంచి బాపట్లకు వలస వెళ్లిన తర్వాత ఆమెకు జిల్లా రాజకీయాలతో ప్రమేయం వుండదని అందరూ భావించారు. కానీ ఆమె నెల్లూరును వదలడం లేదు. ముఖ్యమంత్రి రోశయ్యను ప్రాధేయపడి, ఆయన నెల్లూరు పర్యటనలో తన ఇంటికి తేనేటి విందుకు పిలిపించింది. ఆమెకు ఆనం సోదరులు అండగా నిలిచారు. ఆమె లక్ష్యం, నేదురుమల్లి జనార్ధనరెడ్డి. ఆయనకు ఈసారి రాజ్యసభ టిక్కెట్ రాకుండా చేస్తే, ఇక జిల్లాలో తనదే పెత్తనమన్నది ఆమె వూహ. జిల్లాలో మరొక నాయకుడికి ఢిల్లీ దారులు తెలియవు కాబట్టి, ముఖ్యమంత్రి బలహీనుడు కాబట్టి, నెల్లూరు నుంచి ఎవరు ఎమ్మెల్యే టిక్కెట్ తెచ్చుకోవాలన్నా తనకు పాదపూజ చేయక తప్పదన్నది ఆమె అంచనా. అందుకోసం ఆమె తెగబడి ప్రవర్తిస్తున్నారు. విద్యానగర్ ఇంజనీరింగ్ కాలేజి వ్యవహారాలలో జనార్ధనరెడ్డికి, ఆయన అన్న నేదురుమల్లి పద్మనాభరెడ్డికి మధ్య ఏర్పడిన స్వల్ప వివాదాన్ని కోతిపుండు బ్రహ్మాండం అంతగా పెంచి, పద్మనాభరెడ్డిని సతీ సమేతంగా ఢిల్లీకి తీసుకవెళ్లి, గడప గడప తిప్పి, జనార్ధనరెడ్డి మీద పితూరీలు చెప్పించారు. ఎప్పుడూ ఇల్లు వదలి బయటకు రాని పద్మనాభరెడ్డి సతీమణి ఈ అపర వయస్సులో ఢిల్లీ నేతల ముందు బుడి బుడి ఏడ్పులు ఏడ్పుల నాటకం నడిపిందంటే, వారి మీద పనబాక లక్ష్మి ప్రతాపం ఎంతగా వుందో అర్థం చేసుకోవచ్చు.

గత ముప్పై అయిదేళ్లలో జిల్లా రాజకీయాలలో జనార్ధనరెడ్డి మీద పై చెయ్యి సాధించడానికి నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి, మాగుంట సుబ్బరామరెడ్డి, మేకపాటి రాజమోహన్‌రెడ్డి వంటి మహామహులు ఎన్నో ప్రయత్నాలు చేశారు. కానీ ఢిల్లీలో పట్టులేక వారందరూ ఆయన్ను ఏమీ చేయలేకపోయారు. అంతటి వారి వల్ల కాని పని, రాజకీయంగా పిపీలకం వంటి పనబాక లక్ష్మి సాధించడం చెప్పుకోదగిన విశేషమే. అయితే తనను రాజకీయాలలోకి తెచ్చి, ఒకటికి మూడు ఎన్నికలలో తన డబ్బు, తన పలుకుబడి, తన అనుచర గణాన్ని వాడి ఆమెనొక రాజకీయవాదిగా తీర్చిదిద్దిన జనార్దనరెడ్డి విషయంలో పనబాక ప్రవర్తన, కక్ష కట్టినట్లు కుటుంబ వ్యవహారాలను కూడా వీధులలోకి లాగడం ఎంత మాత్రం సమర్ధనీయంగా లేవు. నిజం చెప్పాలంటే నీచమైన ప్రవర్తనగా కన్పిస్తున్నది. కానీ జిల్లా పెత్తందారి అనిపించుకోవాలనే తమకంలో ఆమె ఉచ్ఛనీచాలు మరచిపోయి వ్యవహరిస్తున్నారు. తన తప్పు ఆమెకు ఎప్పుడు తెలిసి వస్తుందో తెలియదు.

### ఇక మార్పు వుండదా?

నాలుగు నెలల్లో జరగనున్న మునిసిపల్ ఎన్నికల వరకు జిల్లా రాజకీయాలు ఆనం, పనబాక మధ్యనే సుడి తిరుగుతాయా, మార్పనేది వుండదా అన్నది ప్రశ్న. రోజురోజుకు, క్షణక్షణానికి మారిపోతున్న రాజకీయం తీరు చూస్తే ఆ నిర్ణయానికి రావడం సరికాదని చెప్పవచ్చు. వచ్చే నెల మొదటి వారంలో రాజ్యసభ ఎన్నికలున్నాయి. నేదురుమల్లి జనార్ధనరెడ్డి అందులో టిక్కెట్ సాధించి, మరొకసారి ఢిల్లీకి వెళ్తే, జిల్లా రాజకీయం మరొకసారి తలక్రిందులు కావడం ఖాయం. ఎన్నికలు మూడు వారాలలో పెట్టుకొని, వివాదాలు ఎందుకనే నిగ్రహంతో వూరకున్నాడే తప్ప జనార్ధనరెడ్డి కన్నెర్ర చేస్తే నెల్లూరు రాజకీయ మరగుజ్జులు మెలికలు తిరగడం అనుభవం నేర్పిన నిజం. ఆదాల ప్రభాకర్‌రెడ్డి బృందం అంతవరకు ఆనంవారి వుధృతిని భరించక తప్పదు. ఆ తర్వాత వారికి అవకాశం వస్తుంది.



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.